

### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ పీ. పద్ధతి వ్యయముమాలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువకైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒక్కపక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వాహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండు ప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.





వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య

సంపుటము 23] మే 1954 [సంచిక 5

# విషయసూచిక




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## పూజ్యబాబు జన్మదినోత్సవం

ఏప్రెల్ నెల 26 వ తేదీన పూజ్యబాబు కేసరిగారి జన్మదినం. అన్నిపండుగలు, విందులు, ఉత్సవాలతోబాటు తన జన్మదినోత్సవంకూడ జరుపుకోడానికి శ్రీ కేసరి గారు ఎంతో ఉత్సాహంచూపేవారు. గడచిన అయిదారు సంవత్సరాలు అనారోగ్యం గానుండికూడ తన జన్మదినోత్సవము జరిపే కేసరి విద్యాలయమునకు పోయేవారు.

క్రిందటి సంవత్సరము యీ రోజుల్లో చాల జబ్బుగానుండి, నీరసస్థితిలోనున్నా లేని ఓపిక తెచ్చుకొని తన జన్మదినం నాడు కేసరి విద్యాలయమునకు బయలుదేరారు. ఇంట్లో అత్యంత సన్నిహితులు ఆనాటి పరిస్థితులలో పోవడం మంచిదికాదని నివారించడం కష్టమయింది.

ఎప్పటియట్లు కేసరిగారి జన్మదినోత్సవమును కేసరి విద్యాసంఘం విద్యాలయపు ఆవరణలో జరిపిందికాని పూజ్యబాబు లేని కొరత కనుపిస్తూనేయుండింది.

ప్రజాహితాన్ని కోరి, సంఘ శ్రేయస్సుకుగాను పూజ్యబాబు నెలకొల్పిన సంస్థలు కేసరి విద్యాలయములు, గృహలక్ష్మి పత్రిక.

మద్రాసు నగరమందు తెలుగు బాలబాలికలకు స్వభాషలో విద్యావసతులు లేని కొరతను తీర్చుటకు షుమారు రెండులక్షల రూపాయలు వెచ్చించి విద్యాలయాలను స్థాపించి వాని అభివృద్ధిపట్ల ప్రత్యేక ఆసక్తిచూపుతూ వచ్చారు.

'గృహలక్ష్మి' పత్రికను మహిళలను విద్య, సాంఘిక, రాజకీయరంగాలలో ప్రోత్సహించడానికని స్థాపించి షుమారు 25 సంవత్సరములనుండి నిర్వహిస్తున్న ఫలితంగా మహిళా పురోభివృద్ధి మెరుగులు తీరే స్థితిలోకి వచ్చిందని చెప్పాలి.

ఈ సందర్భమున ఆంధ్ర ప్రజానీకం–ముఖ్యంగా నారీమణులు కేసరిగారి అనంతరం స్మృతిచిహ్నంగా నిలబడియున్న 'గృహలక్ష్మి' పత్రికను ఎప్పటియట్లు ఆదరాభిమానములతో తమ ప్రయోజనాలకు, పురోభివృద్ధికి వినియోగించుకోవలసినది గురుతరమైన బాధ్యత.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రనిర్మాణంతో నగరంలోనున్న తెలుగువారు వ్యక్తిత్వానికి భంగము రాకుండా, కేసరి విద్యాలయముల పురోభివృద్ధిపట్ల ఆసక్తిచూపుతూ, తమ బాలబాలికలకు స్వభాషలో విద్యావసతులను పొందవలసియున్నది. అప్పుడేకాని వారు చేసిన దానధర్మములు సార్థక్యము నొందజాలవు ; పరలోకవాసియైన పూజ్య బాబు ఆత్మ శాంతిసౌభాగ్యాలతో విరాజిల్లజాలదు.





# కావ్యాలలో చాటువుల ప్రశస్తి

శ్రీ దాసరి వేంకట కృష్ణయ్య

చాటువు అనగా యింపైనది అని అర్థము. వినుటకు యింపైన పద్యములను చాటువులు అనుట పరిపాటయినది. కవులు, ధనికులు, మంత్రులు, రాజాస్థానములు మున్నగువాటిని సందర్శించినప్పుడు, ప్రకృతి దృశ్యములను జూచునప్పుడు, పరిచిత వ్యక్తులను, వస్తువులను గాంచినప్పుడును సందర్భానుసారముగా కొన్ని పద్యములను చెప్పుచుందురు. మన తెలుగు సాహిత్యములో నివి చాల విరివిగానున్నవి. దూషణ భూషణమందీ చాటువులు అతిశయోక్తులతో, ఉత్ప్రేక్షలతో నిండియున్నవి. ఒక్కొక్కప్పుడు కవులు తమ స్థితినిగూర్చికూడ నిట్టి పద్యములను చెప్పుకొనుచుందురు మచ్చుకు కొన్ని వివరిస్తాను.

పల్నాటి ప్రాంతంలో కవి సార్వభౌముడు శ్రీనాథుడు పర్యటనచేస్తూ ఒక చెఱువులో నీరు లేకుండుటచూచి శంకరు నుద్దేశించి ఎట్లా చెప్పాడో చూడండి.

"సిరిగలవానికి జెల్లును
తరుణుల బదియారు వేల దగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా ?
పరమేశా ! గంగవిడుము, పార్వతి
చాలున్"

శంకరునికి గంగాదేవియు భార్యయని ప్రసిద్ధి. సంపన్నునికి పదియారువేలమంది పడతుల నొప్పుగా పెండ్లియాడుట యుక్తము. బిచ్చమెత్తుకొనువానికి యిద్దరు భార్యలా ? కాబట్టి, ఓ పరమేశా ! నీకు పార్వతి ఒక్కతె చాలును; గంగను విడువవలసినదని చెప్పాడు.

శ్రీనాథునికే ఒకప్పుడు జొన్నన్నం తన గొంతు పట్టుకొంది. అప్పుడు యేమంటున్నాడో చూడండి.

"జొన్నకలి, జొన్నయంబలి,
జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలె
తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నగ బల్నాటిసీమ ప్రజలందఱకున్"

అని పల్నాటి ప్రజలను ఎగతాళిచేశాడు. ఇంకా "తింత్రిణీ పల్లవయుక్తమా నుడుకు బచ్చలిశాకము జొన్న కూటితో మెల్లనయొక్కముద్ద దిగమ్రింగుము నీ పస కాననయ్యెడిన్" అని సాక్షాత్తూ భగవంతుడినే 'సవాల్' చేశాడు. శ్రీనాథుడు మహాభోగి. ఒకప్పుడు కన్నడ దేశములో కనకాభిషేకము పొందిన కవిసార్వభౌముడు. ఆ దేశమునకే చేత పైసాలేక మరొకసారి వెళ్ళాడు. రాజదర్శనమునకై రోజుల తరబడి కాచుకొని యున్నాడు. రాజభోజనములు పోయినవి. రాజాధిరాజుల సరసన బంగారు పళ్లెరములలో విందులారగించిన శ్రీనాథకవి ఒక విధవచేతి వడ్డింపు, వెల్లుల్లివేసిన నువ్వులపొడుము - పాపము అయినను యింత కష్టములోగూడ ఆ మహాకవి యెంత సున్నితమయిన పద్యమును చాటువుగా చెప్పాడో ...

''కుల్లాయుంచితి గోకసుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్
విశ్వస్త వడ్డింపగా
చల్లాయంబలి ద్రావితిన్ రుచులు
దోసంబంచు బోనాడితిన్
తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మి ! దయ
లేదా ? నేను శ్రీనాథుడన్''

''నేను శ్రీనాథుడన్'' - ఆహా ! ఎంత గుండె తరుగుకొనిపోవుమాట ! నేనమ్మా ! శ్రీనాథుడను - మఱచిపోయావా ? మొన్న మొన్న కనకాభిషేకము చేయించితివే ! దయలేదా ? పూర్వము నన్నంత గౌరవించితివే ! ఇప్పుడు కనీసము నాపై దయయైనాలేదా తల్లీ ! అని విలపించాడు.

ఒకప్పుడు రాజమహేంద్రవరమునకు బోయినపుడు అచటి పండితులు యితనింజూచి ఓర్వలేనివారయి, యితనికి తెలుగురాదనియు, అతని కవిత్వమంతయు కన్నడపద భూయిష్టమనియు అతని విమర్శింప సాగిరి. వారి విమర్శలకు శ్రీనాథుడు అవలీలగా సమాధానములుచెప్పి తన కవిత్వమునుగూర్చి యిట్లా చెప్పాడు.

''ప్రౌఢి బరికింప సంస్కృత భాష
యండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష
యండ్రు
రెవ్వరేమన్న నండ్రు నాకేమి కొఱత ?
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష''

ఈ సమాధానముతో విమర్శకులెల్లరు నోరు మూసికొని, నిలకడమీద నతని సాహితీ ప్రతిభను తెలుసుకొని అతనికి దాసోహమనిరి.

ఒకప్పుడు శ్రీనాథుని యెవరో 'అడిగొప్పుల' వెళ్తున్నాను. అక్కడ వారికి యేమైనా చెప్ప మంటారా ? - అని అడగగా యిల్లా అన్నాడట ...

''గుడిమీది కోతితోడను
గుడిలోపలి నంబివారి కోడలితోడన్''

అన్న పద్యం అందరికీ తెలిసినదే. అట్లాగే మఱి యొకసారి నీలాటిరేవువద్ద జలకమాడుటకుపోగా అచటి స్త్రీలు యెంత సేపటికి అక్కడనుంచి పోకపోతే శ్రీనాథునికి విసుగుపుట్టి ఒక రాతిమీద కూర్చున్నాడు. అప్పుడు పూజారివారి కోడలు బిందె నిండా నీళ్లు తీసికొని పోతున్నది. కొంతదూరం వచ్చేసరికి కాలుజారి పాపం క్రిందపడింది. అప్పుడు కవిసార్వభౌముడు —

''పూజారివారి కోడలు
తాజారగ కాలుజారి దబ్బున పడియెన్
మైజారు కొంగుదడిసిన
బాజారే వెనక జూచి ఫక్కున నవ్వెన్''

అని హాస్యంగా అప్పటికప్పుడు 'కోడలుమీద' పద్యం విసిరాడు.

కొంత కాలానికి వార్ధక్యము సంప్రాప్తించి పొట్ట పోసికొనుటకయి కృష్ణాతీరమునగల బొడ్డుపల్లెయను గ్రామమును గుత్తకు తీసికొని జీవయాత్ర చేస్తుండగా ఒక సంవత్సరము కృష్ణానది పొంగుటవల్ల వరదలపాలై పంటభూములన్నియు పాడైనవి. తినుటకు తిండేలేదు. ఇంక శిస్తుఎట్లా చెల్లిస్తాడు ? ఒడ్డె రాజులా మహాకవి యెడల యేమాత్రము జాలిచూపక గుత్తపైకముకొఱకు చాల హింసించిరి. కాళ్ళకూ, చేతులకు సంకెళ్లువేసి, ఎండలో వంగబెట్టి అతని వీపుపై బండలెత్తించిరి. అప్పుడు కవి సార్వభౌముడు యీ విధంగా వాపొయ్యాడు.

''కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు

బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి,
నెట్లు చెల్లింతు టంకంబు లేదు నూర్లు?''

చివరకు చెఱసాల కష్టములకుగూడ లోనయి, జీవితము నేరోసి "దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ, నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి" - అని మహాకవి, - కవి సామ్రాట్టు - అపరసరస్వతి శ్రీనాథుడు అమరపురికి వెళ్ళాడు.

* * *

అష్ట దిగ్గజకవులలో నొకడైన భట్టుమూర్తి అనే రామరాజ భూషణుడు తెనాలిరామకృష్ణునిగూర్చి ఆశువుగా చెప్పిన చాటువు.

''ఆరవి వీరభద్రు చరణాహతిదుల్లిన
బోసినోటికిన్
నేరదు ; రామలింగకవి నేరిచెబో ;
మన ముక్కు తిమ్మన
క్రూరపదాహతిందెగిన కొక్కిరి పంటికి
దుప్పికొమ్ము ప
ల్గారచియించినాడు రవిగాననిచో కవి
గాంచు నెయ్యెడన్.''

అసలు సందర్భమేమిటంటే - ముక్కు తిమ్మన యొకనాడు తన యింట నూయెలలో నూగుచూ కవిత్వము వ్రాసికొనుచుండగా తెనాలి రామకృష్ణుడచటికి వెళ్లి "తాతా ! ఊతునా"యని యడిగెనట. తిమ్మకవి అందుకు అంగీకరించాడు. అంతట రామకృష్ణుడు తుబుక్కున మొగమున నుమిసెను. "నీకిదేమి పోయేకాల"మని తిమ్మకవి అంటే, ఊతునాయని యడిగి - నీ వంగీకరించిన పిమ్మటనే నేనట్లు చేసితినని పలికెనట. తిమ్మకవి కోపమాగక, ఊయలపైనేనుండి నెడమకాలితో రామకృష్ణుని తన్నెనట. అప్పుడు పల్లూడగా రామకృష్ణుడు యింటికిపోయి దుప్పికొమ్ము అరుగదీసి, దానినే పల్లుగా నదుక్కొనెను. మరునాడు రాయలసభకు వచ్చినపుడు రాయలీ సంగతి తెలుసుకొని, ఆస్థానకవులకు "రవిగాననిచో కవి గాంచు నేకదా" అని సమస్య నొసగెనట. అప్పుడు భట్టుమూర్తి ఆ సమస్యను యిందాక నుదహరించినట్లు పూరించెనని చెప్పుదురు.

* * *

ఒకప్పుడు వేములవాడ భీమకవి కళింగగంగు ఆస్థానానికి వెళ్లాడట. రాజు ఏ రాజకార్యములో మునిగి తేల్తున్నాడో గాని యిప్పుడు కాదు మరొకసారి రమ్మని చెప్పాడట. అందుకు భీమకవి ఆవేశ పరుడై-

"వేములవాడ భీమకవి వేగమె చూచి
కళింగగంగు తా
సాయముమాని కోపమున సందడి దీఱిన
రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిక ముప్పది
రెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల
పాలు గావుతన్''

కవి శాపం పెట్టడమూ - దానికి తిరుగు వుండడమూనా! ఆ ప్రకారమే కళింగగంగు గర్భదరిద్రుడయి, దేశదేశాంతరాలకు పోయి బిచ్చమెత్తుతూ పొట్ట పోసికొంటున్నాడు. ఒకనాటిరాత్రి చిమ్మ చీకటిలో కన్ను గానక ఒక గోతిలోపడిపోయి "అయ్యో! దీవిటీకైనా గతిలేక పోయిందే" అని వాపోయాడట. అదే సమయానికి పూలపాలకీ యెక్కి కండ్లు మిరిమిట్లు కొలిపే దీవిటీలతో ఆదారినే పోతున్న భీమకవి 'ఎవర్రా నువ్వు ?' అని పల్కరించాడట. అందుకు కళింగగంగు "భీమకవి గారిచే జోగి చేయబడినవాడను" అని బదులు చెప్పగా "రాజ కళింగగంగువా" అని కవిరాజు ప్రశ్నించాడట. కళింగ గంగు తెల్లబోయి పల్లకీలోని పురుషుడు భీమకవేనని

గ్రహించి చేతులు జోడించి, "మహాకవీ! నన్ను కరుణించు" అని ప్రార్థించేసరికి భీమకవి –

"వేయిగజంబులుండ బదివేలు తురంగ
ములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ నగరంబున బట్టము
కట్టుకోవడే
రాయకళింగ గంగు కవి రాజ భయం
కరమూర్తి జూడగా
బోయెను మీనమాసమున బున్నమ
పోయిన షష్టినాటికే"

అని చాటువుగా అక్కడికక్కడే పద్యం చెప్పాడట. భీమకవి పొమ్మన్నంతనే పోయిన రాజ్యము రమ్మనగానే రాజ్యలక్ష్మి కళింగగంగు కాళ్లవద్దకు రానే వచ్చిందట.

"పెద్దాపురపు కోట పెద్దమ్మ కిల్లొట కవికోపం వలన" నే జరిగిందని మనము వింటూంటాము.

* * *

సహజపాండిత్యుడు బమ్మెరపోతనామాత్యుడు భాగవతమును ఆంధ్రీకరించు సమయమున సరస్వతీదేవి కన్నీరు కార్చుచు నాతని యెదుట ప్రత్యక్షమయ్యెనట. ధనముపుచ్చుకొని కృతినిచ్చుట దాని నమ్ముటతో సమానము. కవికృతమైనది సరస్వతీ స్వరూపము. శ్రీనాథాదుల మాటలు విని పోతన తన్నెచ్చట అమ్మివేయనోయని దిగులొంది సరస్వతి యీతని గ్రోల నేడ్చుచు నిలబడెను. అప్పుడామె నుద్దేశించి పోతనామాత్యుడేమంటున్నాడో చూడండి.

"కాటుక కంటి నీరు చనుకట్టు పయిం
బడ నేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల,
యో మదంబ, యో
హాటక గర్భురాణి, నిను నాకటికిం
గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ
నమ్ము భారతీ."

అని హామీ యిచ్చాడు సరస్వతీ దేవికి. అట్లాగే పోతనామాత్యుడు జీవితము చాలకష్టముగ వెళ్లబోసుకొంటుంటే, వారి అప్తులు తనను భాగవతమును మహారాజుకు కృతి యివ్వమనగా నిరాకరించి –

"బాలరసాల సాల నవపల్లవ కోమల
కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుకూడుభుజించుట
కంటె సత్కవుల్
హాలికులైన నేమి? గగనాంతర సీమల
కందమూల కౌ
ద్దాలికులైన నేమి? నిజదారసుతోదర
పోషణార్థమై."

అని ముఖాన కొట్టినట్లుగా చెప్పి, పైగా కావ్యకన్యకను కూళలకిచ్చి ఆ పడుపు కూడుతో జీవయాత్ర చేయటం దేనికి ... ? ... అని ప్రశ్నించాడు. ఈ విధంగానే పోతనామాత్యుడు తన జీవితమును గడిపాడు.

* * *

"తనవలన యితరులు సంతసించినచో తనకు సంతోషము కలుగవలయును; ఇతరులు దుఃఖించినచో తనకు దుఃఖము కలుగవలయును" అను ఉదార భావమును ప్రజలలో వ్యాపింప జేసిన వారిలో వేమన యొకడు. ఆటవెలది పద్యములకు కాళికట్టిన వాడు వేమన అనియే చెప్పవలయును. లోభి అంటే వేమనకు అసహ్యము. వానిని చంపుటకు మందేమిటంటే –

"లోభివాని జంప లోకంబులోపల
మందువలదు, వేఱుమతము కలదు
పైక మడిగినంత భగ్గునపడి చచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ"

అని చెప్పాడు. ఇంత అసహ్యమందునూ హాస్యము గమనింపదగ్గది. కన్యాదానము అంటే యీ కవికెక్కువ యిష్టము. పేదలు పెండ్లియాడుటకు కన్నెలులభించుట కష్టమైన దినములు వేమనవి. కనుకనే కన్యాదానము ధనికులకు చేయవలదనినాడు.

"కలిమిజూచి యియ్య గాయమిచ్చిన
యట్లు
సముదకియ్య నదియు సరసతనము
పేదకిచ్చు మనువు పెనవేసినట్లుండు"

మనుష్యుల కీలోకమందు నెమ్మదిగా బ్రతుకుటకు కావలసిన వివేకము, నేర్పు, మొదలైన గుణములు నివిబోధిస్తున్నవి ... చూడండి —

"అనువుగాని చోట అధికులమనరాదు
కొంచెముండు టెల్ల కొదువ గాదు
కొండ అద్దమందు కొంచెమై
యుండదా? ..."

పైకి ఏమీ కనిపించకుండా 'కొండముచ్చు'లాగా నుండే వారిని గూర్చి చెప్పిన పద్యము.

"మిరపగింజ చూడమీద నల్లగనుండు
కొరికి చూడలోన చురుకు మనును.."

వేమన కవిత్వమును గూర్చి మనము చాల నేర్చుకొనవలసినది వున్నది. అది స్వానుభవకవిత్వము. తిని యింట్లో కూర్చుని ఊహించి చెప్పినదికాదు. మహాభోగమనుభవించి, చివరికి సుఖమును రోసి, విరాగియైపోయాడు. అతడుమనకు కాగితాలమీద వ్రాసి పెట్టిపోలేదు. ప్రక్కనున్న శిష్యులు వ్రాసుకొంటూండేవారు. చెప్పినవి చాటువులైనప్పటికీ వాటిలో యెంతయో భావము యిమిడి వున్నది.

వేమన చెప్పిన పద్యాలు మనంచూస్తే, మరి యొకటి రెండు విషయములుగూడ స్ఫురిస్తవి. కవిత్వం చెప్పడం కొందఱికి పుట్టుకతోనే వచ్చే స్వభావము. వీరు తమ జీవితములో సంభవించిన అనుభవాలను, దైనందిన జీవితములో యెదుర్కొన్న సమస్యలను కవిత్వంద్వారా బహిర్గతంచేసి, అపూర్వమైన ఆధ్యాత్మికానుభూతిని పొందుతున్నారు. మరి, రెండవ రకమువారు కవిత్వాన్ని అలవరచుకొనే ఒక కళగాను, తీరిక సమయాన్ని సంతోషపరచే ఒక వినోదంగాను, పరిశీలన, శిక్షణ, బుద్ధికుశలత, వీటివల్ల సాధ్యమయ్యే ఒక చమత్కారంగాను పరిగణిస్తారు. వీరిది మంచికవిత్వం కావచ్చుగాని, గొప్పకవిత్వం కాలేదేమో - చాటువులు యీరకం కవిత్వానికి సంబంధించినవైనా కేవలం వీటిల్లో తాత్కాలికమైన వినోద సంపత్తి మాత్రమే వున్నది - శాశ్వతత్వము లేదు - అని చెప్పలేము. ఇందుకు వేమన పద్యాలు మంచి వుదహారణ. తేలికగా లౌక్యంగా కనబడిన యీతని పద్యాలలో గొప్పజీవితపు విమర్శ, ఉద్రేకపూరితమైన నిర్వచనము, జీవితసమస్యలను మనస్సు, బుద్ధి - ఈ రెంటితోను తరచి చూచి ప్రతిభతో మేళవింపజేసి ఒక నూతన మానసిక వికాసమును యివి వ్యక్తపరుస్తాయి.

సాధ్యమైనంతవరకు యే భాష చేతను దుష్టము గాక శుద్ధమై నిలబడినది వేమన కవిత. ఇతని చాటువులందు అనన్యసాధారణమైన సారళ్యము, ధారాళత, నిర్లక్ష్యము మున్నగు కవితా సామగ్రితో నిండియున్నది. ఇతడాడిన మాట ఒరుల హృదయమునందు హత్తుకొని పోగలదు.

(విజయవాడ ఆలిండియా రేడియో వారి
సౌజన్యముతో)

# కేసరి విద్యా సంఘ వార్షికోత్సవము

కేసరి విద్యా సంఘమువారి యాజమాన్యమున ఏప్రిల్ నెల 26వ తేదీన కేసరి విద్యాలయముల వార్షికోత్సవము, శ్రీ కేసరిగారి జన్మదినోత్సవము మైలాపూరునందలి హైస్కూలు ఆవరణలో మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు శ్రీ డబ్లియు. యస్. కృష్ణస్వామినాయుడుగారి అధ్యక్షతన వైభవంగా జరిగింది.

ఉత్సవంలో పాల్గొనిన నగరంలోని ప్రముఖులను, విద్యాలయముల విద్యార్థులను, విద్యార్థుల తల్లిదండ్రులను ఉద్దేశించి స్వాగతము చెప్పుచూ శ్రీ శ్రీపతి రామమూర్తిగారు విద్యాసంఘ వ్యవస్థాపకులగు డాక్టరు కే. యన్. కేసరిగారిని గురించి, వారు కేసరి హైస్కూలు, మిడిల్‌స్కూలు, ఎలిమెంటరీ స్కూల్ల స్థాపనకు, అభివృద్ధికి యిచ్చిన భూరి విరాళములనుగురించి ప్రస్తావనచేసి వారి నిర్యాణముపట్లను, విద్యాసంఘ పరిపాలక సంఘ ప్రెసిడెంటుగానుండిన సర్ అల్లాడి కృష్ణస్వామిగారి మృతి పట్లను సంతాపమును వెల్లడించారు.

ఈ విద్యాసంఘ కార్యదర్శి శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడుగారు విద్యాసంఘపు వార్షికనివేదికను చదువుచు, విద్యాలయముల పురోభివృద్ధిని, సాధించిన ఘన విజయాలను వివరించారు.

న్యాయమూర్తులు శ్రీ కృష్ణస్వామినాయుడుగారు అధ్యక్షోపన్యాసములో మద్రాసు నగరంలోను, దక్షిణదేశంలోను విశేషంగా తెలుగువారు శతాబ్దాలుగా ఉంటున్నారనియు, వారి బిడ్డలకు మాతృభాషలో విద్యాబోధనావకాశములు కలుగజేయవలసియున్నదనిరి. ఈ సందర్భమున తెలుగుబాలబాలికలకు మాతృభాషలో విద్యాభ్యాసానికిగాను మద్రాసునగరంలో – మైలాపూరు, త్యాగరాయ నగరులలో విద్యాలయముల స్థాపనకు, నిర్వహణకు పూనుకొనిన డాక్టర్ కే. యన్. కేసరిగారి ఔదార్యాన్ని ప్రశంసించారు. విద్యాలయముల పరిపాలనా నిర్వహణ పట్ల సంతృప్తిని వెల్లడిస్తూ సంస్థల అభివృద్ధినికోరారు.

ఈ సందర్భమున విద్యార్థులు, విద్యార్థినుల ఉత్సాహాతిశయాలు కనులపండుగగానుండినవి. చిన్న చిన్న నాటికలతో, నృత్య, గాన ప్రదర్శనములతో విద్యార్థులు, విద్యార్థినులు సభికులను ఆనందపరవశులను చేశారు. నృత్యాభంగిమములు – ముఖ్యంగా కుమారి అవలూరి శాంతచే ప్రదర్శించబడిన కూచిపూడి నాట్యము ఒక ప్రత్యేకతగా నొప్పినది.

విద్యాసంఘము తరఫున శ్రీ యం. శేషాచలపతిగారి వందన సమర్పణముతో ఉత్సవ కార్యక్రమము ముగిసినది.

'సిసి'

# ఆయన మీ అన్నగారే!

శ్రీమతి వి. వి. సత్యవతి

ఆదియొక చిన్న పల్లెటూరు. రైలు స్టేషనుకు, యూరికి రెండు మూడు మైళ్ళ దూరముంటుంది. స్టేషనుచుట్టూ చింతచెట్లు కొన్ని యున్నవి. సమీపంలో ట్రంకురోడ్డున్నది. స్టేషను ప్రక్కనే స్టేషను మాస్టరు, పోర్టర్ల నివాసగృహాలున్నవి. వాని నాధారంచేసికొని ఒక చిన్న కాఫీహోటలున్నది.

రామారావు హడావుడిగా పరుగెత్తుకొనివచ్చి కిటికీగుండా బుక్కింగ్ క్లార్కును బెజవాడకు టిక్కెట్టు యియ్యమని అడిగాడు. ప్రక్కగా కూర్చొని సిగరెట్టు త్రాగుతూ ఏదో పేపరు చూస్తున్నాడు గుమాస్తా. అతని వైఖరి రామారావును చీకాకుపరచింది. గట్టిగా మరొకసారి టిక్కెట్టు అడిగాడు.

"ఎందుకయ్యా! అలాగ కేకలు పెడ్తావు! బండిరావడానికి యింకా అర్ధగంట టైమున్నది."

"గంటముందునుండే టిక్కెట్లు యివ్వబడ్తాయని యిచ్చట బోర్డున్నది కదండీ!"

"రాసిన రాతలకు, చేతలకు సంబంధముండదు. ముందు పాసింజరుబండి వచ్చిపోయిన తర్వాతకాని మీ బండికి టిక్కెట్లివ్వబడవు."

"జనసమ్మర్ధంలో టిక్కెట్లు సమయానికి దొరక్కపోతేనండీ!"

"ఇచ్చేపూచి నాదికదా! నీవుపోయి పదినిమిషాలపాటు విశ్రాంతిగా కూర్చో."

బుక్కింగ్ క్లర్కు సమాధానాలు రామారావుకు కారము పూసినట్లయింది. పాపం! సంక్రాంతి పండుగకు రమ్మని మామగారు జాబు వ్రాశారు. అది వివాహమయిన తర్వాత మొదటి సంక్రాంతి - పైగా భార్య పుట్టింట్లోనే యున్నది. నాలుగు నెలలనాడు వదలివెళ్ళిన ప్రియురాలిని ఎప్పుడప్పుడుపోయి ... తొందరపెడ్తున్నవి. పాసింజరువచ్చి వెళ్లిపోయింది. మరల కిటికీదగ్గరకు వెళ్ళి రామారావు టిక్కెట్టు అడిగాడు అయిదు రూపాయల కాగితమిచ్చి.

"చిల్లరలేదండీ" అంటూ అయిదురూపాయల నోటు వాపసుచేశాడు.

"భలేబాగుంది! కొంతసేపు టైముకాలేదని, మరికొంతసేపు చిల్లరలేదని చిక్కులు పెడ్తున్నారేమిటి!" అని సణుగుకొంటూ చిల్లరమార్చుకొని వచ్చి కౌంటరుదగ్గర డబ్బు చెల్లించి టిక్కెట్టు యియ్యమన్నాడు.

"ఈ పావలా చెల్లదు; మరొకటి యుంటే యియ్య"మన్నాడు.

"ఇదేమిటీ ఎగతాళి అనుకున్నారా! - నీపై అధికార్లకు తెలియజేస్తానుండు మీ వెకిలిచేష్టలన్నీను" అని అంటూ యుండగా గంట గణగణ మ్రోగింది; రైలు ప్లాటుఫారంమీదికొచ్చి ఆగింది. మరొక పావలాయిచ్చి టిక్కెట్టు తీసికొని పరుగెత్తుకొనివెళ్ళి బ్రతుకుజీవుడాయని బండెక్కి ఎక్కకముందే బండి కదిలింది. బుక్కింగ్ క్లర్కు కిటికీనుండి తొంగి చూస్తున్న రామారావునుచూచి "పైఅధికార్లకు నా మీద రిపోర్టు చెయ్యడానికి కాగితము, కలము తీసికొనివెళ్లు" అన్నాడు వెటకారంగా. మామగారి యిల్లు చేరి సంక్రాంతి సంబరాల మధ్యయున్నాకూడ బుక్కింగ్ క్లర్కు ప్రవర్తన రామారావు మనస్సును కల్లోలపరుస్తునే యుండింది.

మూడు నెలలు గడిచిపోయింది. బుక్కింగ్ క్లర్కు ఆదుర్దాగా పోష్టుబంట్రోతు కొరకు ఆనాడు ఎదురు

చూచి, చూచి ఏంజాబులు రాకపోయినవి. మరునాడు ఉదయం త్వరగా పోస్టాఫీసుకు వెళ్లేటప్పటికి కట్టలు విప్పుతున్న రామారావు ప్రత్యక్షమయ్యాడు; ముఖం చిన్నబుచ్చుకొని, 'కె. మాధవరావు, బుక్కింగ్ క్లర్కు అనే చిరునామాతో జాబేమైనా యున్నాదాండీ!' అని అడిగాడు

"ఆ - ఆ - నిన్నవచ్చింది. ఎవరో మీరు బదిలీ అయినట్లు చెప్పితేను డెలివరీకి పంపకుండా నిలిపాను. ఇదిగోచూడండి" అని కవరు తీసి చూపాడు.

దానిమీద అతని భార్య కమల వ్రాసిన చిరునామా దస్తూరీనిచూచి "అదేనండీ! నేనే మాధవరావును - దయచేసి కవరిలాయివ్వండి" అన్నాడు కొంత సంశయంగానే.

"క్షమించాలి! మిమ్మలను ఐడెంటిఫై చెయ్యకుండానే! బంట్రోతు మొదటి డెలివరీకి వెళ్లినట్లుంది - రానీయండి. రెండవ డెలివరీయప్పుడు మీజాబు మీకు ముడ్తుంది. మనుష్యులను పోల్చుకోకుండా జాబు లివ్వడం రూల్సుకు వ్యతిరేకం" అన్నాడు రామారావు.

మాధవరావు "నేనేనని చెప్తున్నాను కదండీ! నాజాబును నాకివ్వడానికి మీకెందుకండీ యింత కష్టం!" అన్నాడు తబ్బిబ్బగుచూ.

"సరేలేండి! అంతా మీ ఇష్టమువలెయుందే! పోయి కొంచముసేపు హాయిగా పండుకోండి."

మాధవరావు చేయునదేమిలేక తన చేతుల్లోకి జాబు వచ్చేంతవరకు నిముషమొక యుగంగా యమయాతనకు గురియైనాడు.

నెలరోజులుఅయి, కాకమునుపే తన భార్యను పంపుతున్నట్లు మామగారి ఉత్తరంచూచి ఒక ప్రక్క ఉప్పొంగిపోయాడు; మరొకప్రక్క మాధవరావు ఉనికి కొంత ఆందోళనను కలిగించింది. ఆదరాబాదరా ప్లాటుఫారం టిక్కెట్టు కొనుక్కొని ప్లాటుఫారంమీదికి వెళ్లేసరికి బండి రానేవచ్చి ఆగింది.

లక్ష్మి తొంగిచూస్తున్న పెట్టె దగ్గరకువెళ్ళి తలుపు తీశాడు. ఆమె, వెంబడి సామానులు దిగినై.

లక్ష్మి సామానుల నన్నిటిని లెక్కబెట్టుకొని ఏదో కంగారు పడటం మొదలు పెట్టింది.

"ఏమిటలాగున్నా వేమిటి - పోర్టర్‌ను పిలవనా సామానులు తీసికొని రావడానికి"

"నాన్నగారు కొనియిచ్చిన టిక్కెట్టు ఎక్కడో జారిపోయిందండీ" అన్నది బిక్కముఖంతో.

మాధవరావు జ్ఞాపక మొచ్చాడు

"ఏడవలేకపోయావూ! ఎందుకొచ్చావు యిక్కడికి" అన్నాడు రామారావు ఉగ్రనరసింహమూర్తిలాగ.

లక్ష్మి వేళ్లు నలుపుకొంటూ తలవంచుకొని నిలబడిపోయింది.

"మరి నీ దగ్గర ఎంత డబ్బున్నది"

"నా వద్దనా - రెండు రూపాయలుంది"

"ఛీ! తెలివితక్కువజన్మ! మళ్లీచదువుకున్నముఖానివి" అని చీదరించుకుంటున్నాడు రామారావు.

జనసమ్మర్ధం తగ్గిపోయింది. తప్పించుకోడానికి మార్గము ఆలోచిస్తూ రామారావు, భార్య, సామానులతో పోర్టరు ద్వారందగ్గరకు వచ్చారు.

"టిక్కెట్టు, టిక్కెట్టు" అంటూ మాధవరావు చేయిజాపాడు.

పాపం! రామారావు జరిగిన సంగతంతా చెప్పాడు. కాని మాధవరావుకు కసితీర్చుకోడానికి అది అవకాశమయింది.

"అదంతా వీలులేదు - టిక్కెట్లిచ్చి కదలండి" అన్నాడు.

"ఈ రూపాయితీసికొని ......"

"లంచమా! రైల్వే అధికారులు లంచం తీసికుంటారనా మీ యభిప్రాయం! అసలు మీ ఆవిడ

రావడం బెజవాడనుండియో, మద్రాసు నుండియో ఎవరికి తెలుసు"

"నేను ఎక్కింది బెజవాడలో నేనండీ - అక్కడి స్టేషను మాష్టరు మా నాన్నగారికీ బాగా తెలుసును కూడా! మధ్యలో చెక్కింగ్ జరిగేటప్పుడు కూడా టిక్కెట్టున్నది - తర్వాతనే జారిపోయింది" అన్నది లక్ష్మి అమాయకంగా

"మీరు కలంగజేసుకోవాకండమ్మా! ఆయనతో మాట్లాడవలసిన విషయమిది. ఏమండీ! మద్రాసునుండి యిక్కడికి రైలు చార్జి కట్టి వెళ్లిపోండి"

వాళ్ల దగ్గరున్నది రు 3 లు. నిలుచున్నచోట నిలుచున్నట్లు 8 రూపాయలు ఎలాగ సృష్టియగుతవి?

"అట్లయితే మార్గమేమిటి" అన్నాడు రామారావు అర్థంలేకుండా.

"మార్గమా - అదిగో" నన్నాడు రైలుమార్గాన్ని చూపిస్తూ మాధవరావు. లక్ష్మి తన అజాగ్రత్తను నిందించుకొంటూ రైల్వే క్వార్టర్సువైపు చూస్తూ బిక్కముఖంతో నిలబడింది.

అన్నంతిని విస్తరి పారెయ్యడానికి బయటికి వచ్చి సరోజ లక్ష్మిని గుర్తుబట్టి పరుగెత్తుకొనివచ్చి "బండి వెళ్లిపోయినా యింకా యింతసేపు నిలబడియున్నా రెందుకు? రామారావుకూడ ఉన్నాడుగా రాండి పోదాం - ఎండపడింది. ఏమిటలా తెల్లబోయి చూస్తున్నారేమిటి! మేము యిక్కడున్నామని తెలియదా ఏమిటి" అంటూ చేయిపట్టుకొని తమ యింటికి తీసికొని వెళ్లింది. మాధవరావు, రామారావు వెనుకనే వెళ్లారు.

"అదేమిటండీ! అలాచూస్తున్నారు! ఆయన మీ అన్నగారు. మా పిన్నికూతురు లక్ష్మిని తెలియదూ మీకు! ఏడాది నాడు దాని పెండ్లికి మీకు రావడానికి వీలుకాక నేను మాత్రమే వెళ్లాను. అందుకని మీరు రామారావును చూడలేదు. పెండ్లి నాటికే ఆయనకు బెజవాడలో ఉద్యోగం" అన్నది పరిచయం చేస్తూ.

"అవును అక్కా! యిప్పుడు ఆరునెలలనుండి యిక్కడనే ఉద్యోగం. నేనిదే యిక్కడికిరావడం" అన్నది లక్ష్మి.

ఇక చేసేది లేక "రండి అన్నగారూ" అని మాధవరావు, రామారావుతో చేతులు కలిపాడు కాని మనస్సులు మాత్రం అంత సులభంగా కలిసిపోయుంటవంటూరా!

---

సెకెండు ఫారం చదువుతున్న అమ్మాయిని "శిశుపాలుడెవరు" అని ప్రశ్న అడిగింది పంతులమ్మ

"శిశుపాలుడాండీ — శిశువులను పాలించే ధర్మాత్ముడైయుండాలి"

♦ ♦ ♦

ఇంగ్లీషు మాష్టరు పాఠం చెప్తూ "Season" అనే పదానికి అర్థము ఏమిటి అని అడిగాడు

ఒక బాలుడు లేచి "సముద్రుని కొడుకు సార్" అన్నాడు.

♦ ♦ ♦

ఫస్టుఫారంలో ఒక మాష్టరు వేదాంత విషయాలను వివరిస్తూ! "వాసూ! దేవుడంటే ఎవరు? ఎక్కడ యున్నాడు" అని అడిగాడు.

వాసు ప్రక్కనున్న విద్యార్థి గభాలున లేచి "వాసుదేవుడంటే వీడేనండీ- ప్రస్తుతము యిక్కడే యున్నాడుగా!"

అల్లూరి సోదరి




వయ్యారి భామ

# మీకు తెలుసా!

వర్ణాంతర వివాహాలు, మతాంతర వివాహాలు చేసుకోవచ్చునుగాని, వారి వారి గుణాను గుణాలు తెలుసుకోకుండా పెండ్లాడితే కష్టాలు కొని తెచ్చుకున్నట్లే అవుతుందని-

భార్యా విడాకులిచ్చిందని యేడవలేదుకాని, మరదలు పెళ్ళిచేసుకొంటానంటే యేడుస్తున్నాడుట. (మీ అక్కయ్యతో పడ్డాను పాట్లు యింకనీతో వుండిపోయిందా తల్లీ అని)

నూరు గోవులను చంపితే యెంతపాపమో ఒక్క బ్రాహ్మడిని చంపితే అంత పాపం. నూరుమంది బ్రాహ్మణులను చంపితే కలిగిన పాపం ఒకస్త్రీని చంపడంవల్ల కలుగుతుంది. నూరు మంది స్త్రీలను చంపినపాపం ఒక బాలుని చంపితే కలుగుతుంది. నూరుమంది బాలురను చంపితే యెంత పాపం వస్తుందో ఒక్క అబద్ధం ఆడితే అంత పాపంవస్తుంది.

ఆడది యెంత చదువుకున్నదైనా వంటపని, యింటిపని తెలియకపోతే ఆజన్మకు సార్థక్యంలేదు.

వయసు మీరిన వారు వృద్ధులుకారు తెలివితేటలు వున్న వారే వృద్ధులు.

ఆడదానికి వినయము, విధేయత, ఓర్మి, మిత భాషణము ప్రధానములు.

చదువులేని వాడైనా శరీరదారుఢ్యంకలవాడైతే యేకూలిపని అయినా చేసుకుని బ్రతుకగలడు. యెంత చదువుకున్న వాడైన శరీరారోగ్యంలేని వాడు యేవుద్యోగానికి పనికిరాడు.

ప్రపంచజ్ఞానం తెలుసుకోవాలంటే కేవలం పత్రికా పఠనంకంటే ప్రపంచ పర్యటనమే ముఖ్యం. బడిలో క్లాసుపుస్తకాలు చదివినంతమాత్రాన ప్రపంచజ్ఞానం రాదు.

సేకరణ: నందివాడ కామేశ్వరరావు



# వెనుకదగా!

# ముందుదగ

శ్రీమతి పి. జె. శాంతమ్మ



"ఇదిగో! నాన్నా! నాకిచ్చే 116 రూపాయల కట్నంలోను ఆర్కెస్ట్రాకు 50 రూపాయలూ, 16 రూపాయలు యితర ఖర్చులకుపోతే 50 రూపాయలు మనకు మిగులుతవి. మనం తిండి తినకపోతే ఎవరు చూస్తారులేనాన్నా! 30 రూపాయలతో అప్పులు తీర్చెయ్యి; మరిమూడు రూపాయలు నా రిక్షాలకు, ఒక రూపాయి నా పౌడరు డబ్బాకు! ఏం నాన్నా! అలా చూస్తున్నావు - యీ పగటి వేషానికి పౌడరన్నా లేకపోతే ఎవరూ అభిమానం చూపరునాన్నా! తక్కిన రూపాయలతో నాకు, అక్కయ్యకు, నీకు, అమ్మకు, తమ్ముడికీ ఒక్కొక్క జతబట్టలుకొను. ఈ యున్న రెండు జతల బట్టలు ఒకటి లాండ్రీలో, మరొకటి ఒంటిమీద మారి మారి యుంటుంటవి. అన్నట్లు-మరచాను-లాండ్రీవాడికి రెండు రూపాయలివ్వాలి; వెంకటస్వామికొట్లో రెండు రూపాయల బియ్యం అప్పు తెచ్చింది అమ్మ - మొత్తం నాలుగు రూపాయలిచ్చెయ్యి. అదిగో-పాలవాడుకాబోలు - రేపిస్తామనిచెప్పు" అంటూ తల దువ్వుకొంటున్నది వనజాక్షి.

వనజాక్షి బాగా పాడేదికాని అదృష్టం కలిసి రాలేదు. ఆమె దగ్గర సంగీతము నేర్చుకునిపోయి వందలు, వేలు సంపాదిస్తున్నవారుండేవారు. వనజాక్షిమాత్రం సరస్వతీ ప్రసన్నురాలేకాని లక్ష్మీప్రసన్నురాలు కాలేదు. దానికి కారణాలున్నవి - నైతికంగా నిప్పు కణికలాంటిది; మానమర్యాదలకు ప్రాధాన్యమిస్తూ వ్యక్తిత్వానికి భంగము వాటిల్లడానికి సమ్మతించేదికాదు.

ఆవేళ ఒక పాట కచ్చేరి ఒప్పుకుంది. శెట్టిగారి యింట్లో వివాహం. రు 116 లు కట్నం, ఖర్చులు పైగా యిస్తామన్నారు. అడ్వాన్సుగా రు 30/-లు యిచ్చివేసినట్లే - శెట్టిగారు అంతా మాట్లాడి చివర అడ్వాన్సు యివ్వబోతూ జేబు తడువుకొని "అయిదు రూపాయలు తక్కువగానున్నది; మధ్యాహ్నమువచ్చి యింటిదగ్గర 30 రూపాయలు తీసికో" అంటూ వెళ్లిపోయాడు.

వనజాక్షి రిక్షాలో శెట్టిగారి యింటికి బయలుదేరబోతున్నది. పాపం ఆ అడ్వాన్సునుండే ఆర్కెస్ట్రా వారికి కొంత యివ్వాలి - తాను కొంత తీసికొని రిబ్బన్లు, సబ్బుముక్క, పూలుకొనుక్కొని కచ్చేరికి ముస్తాబు కావాలి. ఇంతలో తండ్రివచ్చాడు.

"ఏమమ్మా! ఎక్కడికో బయలుదేరావు"

"శెట్టిగారింటికి నాన్నా! అడ్వాన్సు యిస్తాను రమ్మన్నాడు"

"ఎంత పిచ్చితల్లివమ్మా! అందుకనే మనల్ని ఎగిరేపక్షులంటారు. ఏదైనా ఆశ పొడచూపితే ఆకాశానికి ఎగిరిపోతాం. నిరాశతో పాతాళానికి పోతాము. మనం దురాశకు పోవడంలేదు. కాని నిర్భాగ్యులు తమ మండే కడుపులకు అన్నం కోరడం కూడ దురాశగానే పరిణమిస్తుంటుంది. ఆ దొంగ ముండాకొడుకు నిజంగా నీకు డబ్బిస్తాడనా! వాడు యివ్వదలచుకుంటే యిక్కడ యివ్వడానికి తన దగ్గర లేకపోయిందా" అన్నాడు.

ఒక ఉపాధ్యాయిని బాలబాలికలకు కొందరు మహామహుల జీవితచరిత్రలను, విశేషాలను చెప్పుతూ "రామూ! యింతమంది గొప్పవారి చరిత్రలను, వారు కనిపెట్టిన యంత్రతంత్రాలను విన్నావుకదా — నీవు చదువుకొని పెద్దవాడివయ్యాక చేయబోయే ఘనకార్యాలేమిటి చెప్పు" అని అడిగింది.

"నేనాండీ – మీటనొక్కితే నేను ప్రతి దినం చేయాల్సినలెక్కలు, చదవాల్సిన పాఠాలు, వ్రాయాల్సినదానిని నిర్వహించే యంత్రాన్ని కని పెట్టబోతున్నాను"

ఉపాధ్యాయిని తలఆడిస్తూ "అదేమిటిరా సోమరి వెధవా – రమాదేవీ నీవు చెప్పు"

"మీట నొక్కడానికి సయితం ఏదైనా యంత్రాన్ని కనిపెట్టాను"

"ఏమిటి నాన్నా! అలాగంటావు - ఖర్చులు కాక 116 రూపాయలు కట్నం-అడ్వాన్సు రు 30 లని వ్రాసి సంతకంపెట్టి కాగితముకూడ యిచ్చివెళ్లాడు. అంతమాట తప్పుతాడా" అన్నది కాగితముచూపిస్తూ. తండ్రి కళ్లద్దాలు సవరించుకొని కాగితాన్నిచూచి "ఓసి పిచ్చిదానా! అడ్వాన్సు రు 30 లు నీకు చెల్లించినట్లు వ్రాశాడు. కొంపదీసి రు 30 లు వాపసు చేయమంటాడేమోచూడు."

"ఛా! ఎంతమాటనాన్నా! అతను నాకివ్వనిదే యివ్వమంటాడా."

"ఇచ్చేసినట్లే వ్రాశాడుగా"

"ఔను-యివ్వాలనుకొని యుంటాడు - పాపం! డబ్బు తక్కువగా నుండటంచేత యింటిదగ్గర యిస్తాను రమ్మన్నాడు. నేను వెళ్లుతున్నాను; యిస్తాడు."

"హ హ హ యిస్తాడు - వెళ్ళి రా మ్మా" అన్నాడు తండ్రి వెటకారంగా.

"ఊరుకోండి నాన్నా! అందరూ ఒకేలాగ దగాకోరులుగా నుంటారా" అంటూ రిక్షాఎక్కి వెళ్లింది.

శెట్టిగారు పెండ్లి పెద్దలతో మాట్లాడుతూ వీధి గుమ్మంలోనే ఎదురయ్యాడు. వనజాక్షి నమస్కారం చేసింది. "వెళ్ళి హాలులో కూర్చోమ్మా!" అన్నాడు శెట్టిగారు.

పావుగంట గడచాక పాటకచ్చేరి రద్దయిందని ఒక కబురు వచ్చింది. శెట్టిగారు వనజాక్షిని చూడనట్లు పెండ్లి పనిపాటలలో నిమగ్నుడై యున్నాడు. సందు చేసికొని శెట్టిగారితో "బాబూ! ఏమిటలా నిర్ణయించారట"

"ఔను - పాటకచ్చేరి అవసరంలేదు"

"ఏం బాబూ"

"మరొక ముఠావచ్చి వేధిస్తున్నారు. నీ ప్రోగ్రాం రద్దుచేసి వాళ్లకు అవకాశమిచ్చాను."

"వాళ్లకంటె ముందునేంచి తిరుగుతున్నానుకదా బాబూ! పైగా నన్ను బుక్ చేశారుకూడాను. తమ స్వహస్తాలతో అడ్వాన్సు యిచ్చినట్లు వ్రాసారు."

"ఆ! అన్నట్లు - నీకిచ్చిన అడ్వాన్సు వాపసిచ్చెయ్యి."

"అదేమిటిబాబూ! అయిదు రూపాయలు తక్కువగానున్నవని యింటిదగ్గర యిస్తాను రమ్మని యిప్పుడు ... "

"అదేమిటమ్మా! యివ్వకుండా యిచ్చినట్లు నేను ఎట్లావ్రాసి యుంటాను; ఎలా వ్రాయించుకొని యుంటావు! - పోనీలే పేదదానివి" అంటూ లోప

లికి వెళ్ళాడు శెట్టి. "బాబూ! బాబూ!" అంటూ పిలిచి నిస్పృహతో కాళ్ళీడ్చుకుంటూ యింటి ముఖం పట్టింది.

పడక కుర్చీలో పండుకొని తండ్రి చుట్ట కాలుస్తున్నాడు. వచ్చీరావడంతోటే తండ్రినిచూచి బావురుమని ఏడ్చింది వనజ.

"ఊరుకో అమ్మా! ఊరుకో - నాకు తెలుసు" అన్నాడు కుమార్తెను బుజ్జగిస్తూ.

"నీ కెలా తెలుసు" అంటున్నట్లు తండ్రి ముఖం వైపు చూచింది.

"ఇలాంటి టోకరాల కెన్నింటికి గురికానిదే నా జీవితం యీ స్థితికి వచ్చిందంటావు! నీకే జరిగిన దానిని గురించి నాకు ముందే తెలుసు. డబ్బు పాపిష్టి దని పెద్దలన్నదిందులకే. అది యీ లోకంలో ఎంతపనైనా, ఏపనైనా చేయిస్తున్నది - అదేమిటమ్మా అలా వణుకుతున్నావు! - అబ్బా ఒళ్లు కాగి పోతున్నది! పండుకో అమ్మా! మనలాంటి పేద వారి బాధలను ధనవంతులు గ్రహించరు తల్లీ! గ్రహించి సానుభూతిచూపే వారి దగ్గర మనకు సహాయంచేయడానికి డబ్బుండదు" అంటూ తన్ను అనుకొనియున్న కుమార్తెను మంచముమీద సరిగ్గా పండుకో పెట్టాడు.



# అబలా!



కాకర్లమూడి ఎరిక్ శాంసన్.

"క్షమించండి నాన్నగారు. నాకు ఆయనెవరో తెలియదు. పెళ్ళంటే నాలుగు రోజుల ముచ్చటకాదు. అన్నీ సరిగ్గానుంటే వందేళ్ళ కాపురం. ఆయన హృదయం నేను, నాహృదయం ఆయనా తెలిసికోందే కాపురం సాఫీగా నడవదు. అయినా పెళ్ళి చేసికోడం నేను కాని మీరుకాదు."

అంతలో సుందరమ్మగారు కూతురు మాటల నందుకొంటూ "అమ్మా, నేను తెలియక అడుగుతాను నేను మీనాన్నను పెళ్ళయ్యే దాక యెరుగను కాని మా సంసారంలో యేం ఒడుదుడుకులు వచ్చాయి."

"హు, స్త్రీకి స్వతంత్రం యేనాడో చచ్చింది. కనీసం పెళ్ళివిషయంలోనైనా స్త్రీ తన భర్తనెన్నుకోటంలో స్వతంత్రం ఇస్తే దేశం యేనాడో బాగుపడేది..."

"ఛ. నోరుముయ్ పిట్టకొంచెము కూత ఘనము, అయినా నీకీ వెధవప్రసంగం యెందుకు! మేమెవణ్ణికడ్తే వాడే నీ మొగుడు" అని అంతదాక ఊరుకొన్న విశ్వనాధంగారు గదమగనే వసంత తన గదిలోకిపోయి అదేపనిగా యేడ్వడం మొదలుబెట్టింది.

వసంత చదువు, సంస్కారముగల పిల్ల. ఇంటరు పరీక్ష రాసింది. యెదిగిన పిల్ల. ఇంతకాలం యింట్లో ఉండడం చేత నలుగురు నాలుగుమాటలు అనడం మొదలు బెట్టారు. విశ్వనాధంగారు ఇహ సహించలేక వరుణ్ణి అన్వేషించుటకు బయలుదేరి యెలాగైతేనేమి తనస్థితికి సమానమైన ఒక బి. యే. ప్యాస్ అయినా కుర్రాణ్ణి వరునిగా తెచ్చారు. పేరు శాంబాబు. పిల్ల యిష్టపడినా, యిష్టపడక పోయినా, దగ్గర ముహూర్తం నిశ్చయించారు.

ఏలాగైతేనేమి వసంత మెళ్ళో ఆ మూడు ముళ్లూ వేయించేదాక విశ్వనాధం సుందరమ్మలకు నిద్రపట్టలేదు. అయిందేదో అయిందని వసంత కాపరానికి పోయింది. అత్తగారు మొదట్లో బాగున్నా ఉండేకొద్ది తొండ ఊసరిల్లి అయింది. అయినా ఈ అత్తగార్లు ఒకప్పుడు తామూఒకింటి కోడళ్లమని యెందుకు మరచిపోతారో!

శాంబాబు పెళ్ళయిన క్రొత్తలో వసంతను విడిచి క్షణం ఒక మహాయుగంలా గడిపి ఆఫీస్ టయిమ్ అయి అవకముందే యింటికివచ్చి వసంతతో హాయిగా కాలం గడిపేవాడు. కాలం అలాగ దొర్లిపోతూంది. ఇప్పుడు వసంతకు యిద్దరు మొగపిల్లలు. ఒకడు వసంతకుమార్, ఇంకొకడు విజయకుమార్. కాలక్రమంగా శాంబాబు ఇంటికి ఆలస్యంగా రావడం మొదలు పెట్టాడు. ఒక్కొకప్పుడు హోటల్లో భోంచేసి సినిమా

చూచి వచ్చేవాడు. ఆలస్యంగా వచ్చేరేం అని అడిగితే "ఏం, నీ సన్యాసి మొఖానికి యెప్పుడు యెదురుగ ఉండాలనేమి" అని కసరుకొనేవాడు.

'ఛీ, యీ మగజాతి అంతా ఇంతే. పెళ్లికాకముందు మేము వీళ్ళకు అప్సరసలము. మేము ఒక్కసారి వాళ్ళవైపు చూస్తే సరి వాళ్ళకు దేముని ప్రసాదముతో సమానం. మేము నిరాకరిస్తే, ఆత్మహత్య చేసికొంటాము అంటారు. మేము వారితో సంతోషంగా ఉంటే స్వర్గసౌఖ్యాలను అనుభవిస్తున్నామంటారు. కాని పెళ్ళయి సంతానం కలిగింతరువాత మేము వారికి చీడపురుగులము. మా ముఖాలు, సన్యాసిముఖాలు ఇంకా యెంతగానో నీచంగా చూడబడుతాము!' అని వసంత యేమేమో అనుకొనేది.

ఒకరోజు వసంత స్నేహితురాళ్ళతో పాటు పొరుగింటికి పేరంటాలకు పోయింది. వచ్చేప్పటికి కొంచెం ఆలస్యమయింది. ఆరోజు యెందుకో కొంచెం త్వరగా వచ్చాడు. వసంత కాస్త ఆలస్యంగావస్తే నానామాటలు చీవాట్లు పెట్టాడు. వసంతకు కళ్ళంబడి నీళ్లు బొటబొటా రాలాయి. పాపం ఆమె యేం నేరం జేసిందని శాంబాబు ఆమెను ఆవిధంగా చీవాట్లు బెట్టాడు. తాను ప్రతిరోజు ఆలస్యంగా వస్తుంటే ఆమె "ఇలా ఆలస్యంగావస్తే యెలాగండీ" అనే మాట తప్ప తక్కిన మాటలు మాట్లాడలేదుకదా. అట్లయితే శాంబాబు ఆమెను అంతకష్టపెట్టాడెందుకు ఆయనను యెవరు అనేవాళ్ళు లేరనా? సంఘం పురుషులది కాబట్టి తానేవిధంగానైన ప్రవర్తించవచ్చునా? సంఘం పురుషులదైనప్పటికిని స్త్రీకి సముచితమైన స్థానమివ్వాలి. ఆమెను అన్నివిధములుగ గౌరవించుట సంఘానికి శ్రేయస్కరము. అలాంటప్పుడు ఆమెను అన్నివిధములుగ గౌరవించుటే సంఘానికి శ్రేయస్కరము. అలాంటప్పుడు ఆమెను ప్రతి చిన్న విషయంలో దండించుట సంఘానికి తలవంపు.

శాంబాబు కొన్నాళ్ళకు యింటికిరావడం మానేశాడు. జీతం సరిగ్గా యింటికి తేవటం లేదు. వసంత భర్తవిషయంలో కొంత కలవరపడింది. భర్త సానికొంపలు చుట్టు తిరుగుతున్నాడనే వార్త వసంత చెవిలో పడింది. యేం జేస్తుంది పాపం! చెవిలో పడిన వార్తలు చెవిలోనే దాస్తోంది సంసారం గుట్టుగా జరుపుకుంటూంది.

ఒకరోజు శాంబాబు తాను ప్రేయసిగా నెంచిన స్త్రీకి ఇంకొక పురుషునితో సంబంధమున్నట్లు గ్రహించారు. ఛీ! అనిపించింది. తానేమి చేయగలడు? ఆస్త్రీ డబ్బుకు కొనబడే వస్తువులాంటిది. ఎవరిదగ్గర డబ్బుంటే వాడిదే ఆమె. దాంతో శాం

బాబు కామాంధకారం కాస్తా పటాపంచలయింది. కళ్ళు తెరవబడ్డాయి. భార్యా పిల్లలు జ్ఞాపకం వచ్చారు. గృహోన్ముఖుడయ్యాడు. పిల్లల్ని దగ్గరకు తీసికొని ముద్దు పెట్టుకొన్నాడు. వసంతను క్షమాపణ అడిగాడు. పాపం వసంత యిక యేం చేయగలదు! స్త్రీ హృదయం అంతలో పాషాణం అవుతుంది; అంతలోనే మంచువలె కరిగి పోతుంది. స్త్రీకి ముఖ్యంగా యిదే బలహీనత. ఇందువల్లనే ఆమె తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి అబల అనిపించుకొంటున్నది.




సూర్యోదయము

# దోరపండు

శ్రీ బచ్చల మునికన్నయ్య



ఇంట్లో అందరూ హడావిడిగా నున్నారు. పక్కింటి అక్కింటి అమ్మలక్కలు వస్తూపోతూ వున్నారు. ఏనాడులేని ఆనందం యీనాడు తొణికిసలాడి పోతూన్నది. ఇంతలో మా అక్కయ్య రెండు బంగారు వుంగరాలు తెచ్చింది. వద్దన్నా బలవంతంగా నా వ్రేళ్లకు వేసింది. ఒకటి చాల వదులుగావుంది. వెంటనే మా మామగారు ఊలు తెచ్చి చుట్టి బిగువుగా వేశాడు. మా చిన్నాయనగారు పట్టు పంచ, చవకం తెచ్చాడు. మా పిన్ని సెంటుబాటల్ తెచ్చి ఎవరికి తెలియకుండా నా జోబీలో వేసింది. మా అమ్మ చద్దికూడుమూట సిద్ధమైందని వుషారు చేసింది.

సోమవారం రాహుకాలం దాటిపోయింది. పది గంటల బస్సుకు అందరం బయలుదేరాం. సుబ్బన్న వీధి గుమ్మం దగ్గరకు వెళ్ళి "రండి! రండి!! ఎవరూ అడ్డంరాలేదు. రండి! వేళైంది." అని పిలిచాడు మమ్మలను. శకున మేమౌతుందోయని మా వాళ్లు చాల గాబరాపడుతున్నారు. ఈ శకునాల్లో, రాహుకాలాల్లో నాకు నమ్మకం లేకపోయినా - నా నోరు కదపనీయరు మా వాళ్లు. బదులు మాట్లాడేందుకు నాకు సాహసం లేకపోయింది. వాయసం తీర్చింది. "బలే శకునము! మంచి శకునమైంది! తప్పక పిల్ల కుదురుతుందిలే" అని అందరు సంతోషంతో మమ్మల సాగనంపారు. ప్రతి ఒక్కరు "క్షేమంగాపోయి, లాభంగారండి" అని దీవనలిచ్చి అక్కడక్కడ నిల్చిపొయ్యారు. అక్కయ్య, మామ, చిన్నాయన, నేను మిగిలాం. మా గ్రామానికి రెండు ఫర్లాంగుల దూరంలోనున్న రోడ్డు చేరుకొన్నాం. గంట పదియైంది. బస్సు వచ్చుసమయం. పెట్టెలు గొడుగులు మా చిన్నాయనగారి ఆజమాయిషీక్రింద యున్నాయి. బస్సు హారన్ ... వినబడింది. గబగబా పెట్టెలు చేతితో పట్టుకొని మేము నిలబడ్డాం. బస్సు మా దగ్గర నిల్చింది. అందరూ బస్సులో కూర్చున్నాం. నా అలంకారం చూచుకొంటూ యుంటే నాకే నవ్వొస్తూయుంది. ఎందుకంటే గడియారమంటే వినకుండా బస్సులో ప్రయాణంచేస్తూయుండు నా స్నేహితుడు గడియారం నా చేతికి కట్టాడు. బంగారుకు మెరుగుపెట్టి నట్లైంది. "దసరా సెలవులు మంచి దశగానేయుంది కుమార్!" అంటూ నన్ను పలుకరించాడు మధుమూర్తి. "ఏమోయ్! మధూ ఈ లాంటి ప్రయాణాలు ఒక డజను చేశాను. పదవతరగతి చదువునప్పటినుండి నేటివరకు సెలవులొస్తే యీ పెండ్లి ప్రయాణాలల సాధారణమే. కాని ఈ ప్రయాణం చాల కుతూహలంగాయుంది."

"ఎందుకోయ్?"

"పిలుపువచ్చింది."

"ఎచ్చటినుంచి?"

"కనకపాళ్యంనుంచి"

"కనకపాళ్యం ఎక్కడ ...?"

"నెల్లూరుకు ప్రక్కన పదిమైళ్లలో..."

"అచ్చట మీ బంధువులున్నారా?"

"ఉన్నారు"

"అయితే ఇక నెల్లూరి వాడవౌతావన్నమాట."

"అదిగో అప్పుడే ప్రారంభించావా."

"లేదోయ్! దూరపుకొండలు నునుపేగా?"

"ఆలూలా, సూలూలా, కొడుకుపేరు సోమలింగ డన్నట్లుంది నీ మాటలు."

"సామెతలకేమి తక్కువ. పోయిరా చెప్పుతా."

అంటూ మధూ నేనూ మాట్లాడుతున్నాము. బస్సు రైల్వేస్టేషను చేరింది. అందరందిగి ప్లాట్‌ఫారమ్‌మీదికి వెళ్లాం. మా చిన్నాయనగారు అంద

రికి గూడూరువరకు టికెట్లుకొన్నాడు. "టింగ్ ... టింగ్ ... టింగ్ ... టింగ్ ..." అని బెల్లు కొట్టారు. రైలువచ్చి స్టేషనులో నిల్చింది. మా చిన్నాయన ఆ తట్టూ యీ తట్టూ పరుగెత్తుతూ "రండీ! రండీ!!" అని అరుస్తూ యున్నాడు. ఒక పెట్టెలోనుండి ప్రయాణీకులు దిగుతూయున్నారు. మా అక్కగార్ని ముందు ఎక్కమని రొదచేస్తూ యున్నాడు మా చిన్నాయన. తలుపునకు అడ్డంగా పెద్ద మూటపెట్టి ఒకాయన దానిపై కూర్చొని యున్నాడు. "ఏమండీ! దారిలో యీలావుంటే ఎట్లండి లోపలికిరావటం?" అని అతనిని ప్రశ్నించాను. పెట్టెలోనున్నవారంతా "లేవయ్యా! లేయి!! అప్పుడే చెప్పలేదూ మేము" అని ఆయనను గద్దించారు. అతడు విసుక్కుంటూలేచి ప్రక్కకు జరుపుకున్నాడు మూటను. హాయిగా అందరం రైలులో కూర్చున్నాం. బండి కదిలింది. "ఓ భావి భారత భాగ్య విధాతలారా! ..." అనుగేయం భిక్షగాడొకడు చిటుకలు తట్టుతూ పాడుతూయుంటే మావారంతా సంతోషాతిశయాలతో పొంగిపోతూ యున్నారు. నాకు చాల కోపం వస్తూయుంది. పాట బాగుగాలేదనికాదు ... మొక్కాలవుంటూ యీ యువకుడు "బాబూ! ... ..." అని చేయి చాపుతూ భిక్షమడుగుతున్నాడని. నేను మాత్రం యేమీ యీయలేదు. అంతేకాదు "ఏమోయ్? పందిలాగ బలిసియున్నావే! ఏదైనా పనిచేసికొని బ్రతుకరాదూ?" అని కోపంతో గద్దించాను. "బాబూ! కండలున్నా కనికరంతో పనికల్పించేవారు కరువయ్యారండీ!"

"ఏమిపని నీవు చూపేదోయ్? ఎంతవరకు చదివావు?"

"ఎందుకులేండి ఆ మాట. అక్షరాలు రాకపోయినా ఆకలి కాకపోవటంలేదండీ. కండలరిగే పనైనా చిక్కితే కదండీ?"

"పని నిన్ను వెతుక్కొని వస్తుందిలేపాపం! ఏ పల్లెకుపోయిన బోలెడంత కూలిపనియుంది. ..."

"దినమంతా దేహాన్నిపిండి పనిచేసినా ఒక్క రూపాయి చిక్కటం దుర్భరమౌతుంది దేవరా పల్లెల్లో. మా నాన్నకు కాళ్లులేవు. మా తల్లి చిన్నప్పుడే చనిపోయింది. ఇక నా భార్యా పిల్లలు ... న్నారు. వీరి బ్రతుక్కు నేనొక్కణ్ణే సంపాదించాలి. ఆ పల్లెల్లో కూలి ఏలా సరిపోతుందండీ!"

"అయితే ఇందులో నీ కెంత ఆదాయం?"

"ప్రతిదినం నాలుగైదు రూపాయలకు తక్కువ లేకుండా దొరుకుతుందండీ."

"దొరుకుతుంది! దొరుకుతుంది! అందరూ కండ్లు మూసుకొని దానంచేస్తే మరి ఎందుకు దొరకదూ? సోంబేరి!" అంటూంటే మా మామగారు "వాడితో యేమిరా నీ వేదాంతం! పాపం ... బీదోడు ... నీకిష్టమైతే కానీ సాయంచేయి ... లేకుంటే గమ్మునుండు. ఏమో నాల్గువేదాలు వల్లిస్తూయున్నావే వాడి దగ్గర," అని నన్ను మందలించాడు.

"పోనిరా 'పాపం!! ..." అంటూ మా చిన్నాయన కానీ వానిచేతిలో పెట్టాడు. నా ప్రబోధాలు మావారే వినటంలేదే! మరేమిచేయటం. లోకం ఇంతే. ఇంతలో రైలు ఆగింది రేణిగుంట స్టేషన్లో అందరూదిగి బండి మారాము. స్థలం దండిగాయుంది. విశాల సంద్రాన విష్ణుదేవుడు విశ్రమించినట్లు సంచి తలక్రింద పెట్టుకొని పండుకొన్నాను నేను. నాకు దినపత్రికలు, పుస్తకాలు ప్రయాణాల్లో చదవటం పరిపాటి. దినపత్రికను పూర్తిగా చదివాను. చేతనున్న భారతంలోని ఆదిపర్వం చదువనారంభించాను. దుష్యంతుడు శకుంతల సమాగమ కథాభాగము చదువుతూయుంటే దేహం పులకరించిపోయింది. ఎంతటి చక్కని శైలి! నన్నయగారు మన తెలుగు సరస్వతికి నాయనగారేమోననిపించింది. ప్రయాణంకూడా ఫలప్రదమౌతుందన్న యూహతో నేను సంతసించుతున్నాను నాలో. "టికెట్! టికెట్!" అని టి. సి. పరిశోధిస్తూ యున్నాడు. టికెట్లు చూపబడినాయి. ఎదురుగానున్న నలుగురు

యువకులు అదోమాదిరిగా చూస్తూయున్నారు. పని పట్టినట్లుంది టి. సి. "మీ టికెట్లేవీ చూపండి?" అని ప్రశ్నించాడు. అందరు స్ప్రింగ్ వలెలేచి నిలబడ్డారు. "ఏమోయ్! నిలబడ్డారు? ఎక్కడ నుండి వస్తూన్నారు?" అని బిగ్గరగా అడిగాడు. "సార్! మేము అరకోణంనుండి వస్తూయున్నాం. బ్రతుకులేక తెనాలికి పోతూయున్నాం దొంగబండ్లల్లో. అందరు టి. సి. లు మమ్మల "పాపమని" మన్నించారు. మీరూ ... ... ... ..." అని మూగనోములతో నిలబడ్డారు. ప్రక్క స్టేషనులో దిగండి అని చెప్పి టి. సి. ప్రక్క పెట్టెకు వెళ్ళాడు. అమృత లభ్యమనంతరం దేవతలు సంతోషపడ్డట్లు "బ్రతుకు జీవుడా"యని వారు మళ్లా ధర్మసింహాసనాలధిష్టించారు. వర్షం ఏకధారగా కురుస్తూయుంది. అందరు పెట్టె ప్రక్కలనుండు కిటికీ అద్దాలను పైకెత్తారు. ప్రక్కల నిండు గర్భంతోనున్న చెఱువులు పరుగిడుతూయుంటే కన్నులపండుగగాయుంది. అప్పుడే తలలెత్తిన పచ్చనిపైర్లు ఆనంద బాష్పములను వదులుతూ యున్నాయి. ఈ ప్రకృతి సౌందర్యాన్ని అనుభవించేందుకే రైలు నిదానంగా వెళ్లుతున్నదేమో! మధ్యాహ్నం రెండు గంటలకు గూడూరు చేరాం. అచ్చటినుండి బస్సు ప్రయాణమే శరణ్యం. బస్సు స్టేండుకు వెళ్ళాం. నెల్లూరికి వెళ్లేబస్సు సిద్ధంగాయుంది. గబగబా టికెట్లుకొని బస్సులో కూలబడ్డాం. చిటుకు చిటుకుమని నీటిబొట్లు పైన పడుతున్నాయి ప్రయాణాపేక్షలో ఏదీపాటించలేదు. నెల్లూరుచేరితే పదివేలని నెమ్మదిగానున్నాం. బస్సు స్టార్టైంది. బారెడు దూరంపోయి బర్ ... మని ఆగిపోయింది. పాపం ... డ్రైవరు కండక్టర్లు యెంతో శ్రమించారు రిపేరు చేసేందుకు. వారి పేకలు సాగలేదు. ఇక బస్సు వెళ్లటంలేదని డబ్బు 'రిటర్న్' చేశారు. ఎంత అవసరంపడితే అంత ఆలస్యమన్నట్లు మా ప్రయాణంలో మందగమనము ప్రారంభించింది. మరొక్క బస్సులోఎక్కి సాయంకాలం 4·30 గం॥లకు నెల్లూరు చేరుకొన్నాము. పెన్న పొంగి పారుతూయుంది. 20 అడుగుల జల ప్రవాహం చాల భీబత్సంగాయుంది. పడవల్లో సైతం దాటేందుకు వీలులేనంతటివేగం. కొందరు రైల్వేబ్రిడ్జీమీద సునాయాసంగా పోతూయున్నారు. మేము సాహసించి రైల్వేబ్రిడ్జీమీద పోవాలనుకొన్నాం. ఆ బ్రిడ్జీమీద నడచివెళ్లేందుకు మనిషికి రెండణాలు పగటిలంచం వసూలుచేస్తూయున్నారు కొందరు యినాందార్లు. కొందరు ప్రభుత్వోద్యోగులు కూడా యున్నారు. ఇదంతాచూచి నా కడుపు మండిపోయింది. గేటుదగ్గరకు వెళ్ళాం. ఇనాం అడిగారు. "ఏమయ్యా! ఎందుకీడబ్బు? గవర్నమెంటు వసూలా, గౌరవసంఘ వసూలా?" అని ప్రశ్నించాను. దూరంగానున్న పోలీసు బంట్రోతువచ్చి "పోనీండి! వాళ్లకు తెలియదులేండి. మీరు పొండి" అని సమాధానపరచారు. గేటు దాటుకొని అర్ధరూపాయ్ మిగిలిందని ముందుకుపోతూయున్నాం. బ్రిడ్జీమీద నడుస్తూయుంటే భయం భూతద్దంలా కనిపిస్తూంది. నా యెడమచేతితో మా అక్కయ్య చేతినిపట్టుకొనియున్నాను. కుడిచేతిలో దినపత్రిక, భారతం యున్నాయి. మా మామ చిన్నాయనగార్లు పెట్టెలు గొడుగులు ఎత్తుకొని వస్తూయున్నారు. నడిబొడ్డు జేరాం. మా ఎదురుగా గూడ్సు వస్తూయుంది. ఇంకేమి? మా అక్కయ్యగారు చాల గాబరాపడ్డారు. కాళ్లు వణుకుతూ, తడబడుతూ యున్నాయి. భయపడవద్దని చెప్పుతూ బారెడు దూరంలోనున్న తొట్టిలోనికి తొలిగాం. అందులో నాల్గుసైకిళ్లు, మనుషులు చాలమంది క్రిక్కిరిసి యున్నారు. చేతిలోని పుస్తకాలుజారితే గంగపాలే. కాలు తప్పితే పెన్నపాలుకాక తప్పదు. ఏలాగో తొట్టిలో దాదాపు యాభైమంది అణిగి పోయ్యాం. బుసలు కొడుతూ గూడ్సువెళ్లిపోయింది. చేతిలో పెట్టుకొన్న ప్రాణాలు సంతసించాయి. తొట్టివదలి బ్రిడ్జిమీద నడుస్తూయున్నాం. చీకటిపడింది. సరిగా త్రోవ కనబడటంలేదు. చాల ఏకాగ్రతతో చూస్తూ బ్రిడ్జిని దాటాం. "నాయనా! చాలురా, యీ ప్రయాణం! బలే పెండ్లి ప్రయాణం! అపాయమైందిరా దేవుడా!" అనింది మా అక్కయ్య

చంకలో పెట్టుకొన్న బిడ్డను క్రిందదింపి దీర్ఘ ఉచ్ఛ్వాస, నిశ్వాసములు చేస్తూ. ప్రక్కనే బస్సుల గుంపు కనబడింది. కనక పాళ్యంపోయె బస్సు అప్పుడే వెళ్ళిందట. ఆరాత్రి ప్రక్క పల్లెలో పండుకున్నాము. గాంధీ పార్కులో. దోమల గానంతో తెల్లవారి పోయింది. ఉదయం బస్సుస్టేండుకువచ్చి కనక పాళ్యం పొయ్యే బస్సు ఎక్కాము. డ్రైవరు సిగరెట్టు త్రాగుతూ పొగవిడుస్తూ యున్నాడు. కండక్టరు ఫుట్ బోర్డు మీద నిల్చొని చేతులు ప్రక్కకు చాపుతూ యున్నాడు. బస్సులోపల "పొగత్రాగరాదు. చేతులు బయట పెట్టరాదు -" అని వ్రాసిన బోర్డును చూశాను. వ్రాయింపించిన బస్సు వాళ్లే నేతి బీరకాయలాంటి బోర్డుగా దానిని తయారు చేశారు. కనకపాళెంచేరింది బస్సు. నవనవోన్మయ యౌవన తేజాన్ని ప్రదర్శించే దుస్తులను ధరించాను. రెండు మూడు వీధులలో వంపులుతిరిగాం. ప్రక్కకు తిరిగి "ఇదేరా మనోళ్ళ యిల్లు"ని లోపలప్రవేశించాడు మామగారు. మెరపులాగ అచ్చట కూర్చొని వ్యాపారం చేస్తూయుండిన యువతులిద్దరు మరుగైనారు. ఇంటిలోనుండి పెద్దామెవచ్చి కాళ్లు చేతులకు నీళ్లిచ్చింది. అక్క చిన్నాయన, మామగార్లు లోపలకి వెళ్లారు. నేను హాలులో నున్న పట్టెమంచంమీద కూర్చున్నాను. గోడకు వ్రేలాడు "గోపికా కృష్ణుల జలక్రీడ" - పటాన్ని చూచి సర్వేశ్వరుడు కూడా సరసుడే యనుకున్నాను. ప్రక్కింటివాళ్లు తొంగి తొంగిచూస్తూయున్నారు కిటికీగుండానన్ను. అందులో ఒకమ్మాయి చాల సిగ్గుతో "అదిగో! ... ,..... ..." అనినావైపు చూపుతూయుంది. నేనుచూడలేదని కాబోలు. చూచీ చూడని దొంగ సన్యాసివలె యున్నాను నేను. ఆ అమ్మాయి యింతకు పూర్వం యిచ్చటినుండి యెగిరి పోయిన విద్యుల్లత యనుకొన్నాను.

వంటలైనాయి. కమ్మని వాసనలు జమ్మని వస్తూయున్నాయి. వడ్డించిన విస్తర్లప్రక్కన కూర్చున్నాము. నాపీటక్రింద పెళ పెళశబ్దం కల్గింది. ఉలిక్కిపడ్డాను. కాని పరిహాసం పెంకుబిళ్ళలని ప్రక్కన కొందరు నగుతూయుంటే గ్రహించాను. అరిచినపలుకులు అణిగిపొయ్యాయి. వడ్డించిన విస్తరచూస్తే భావిజీవిత వాసనలకు నాంది ప్రస్తాపన యనుకున్నాను. "కొత్తొక వింత, పాతొక రోత-" యను సామెత జ్ఞప్తివచ్చింది. అందరు త్వరగా భోంచేశారు. నాది ఆలస్యం. అందరు నన్ను చూస్తూయుంటే, గబగబా తినేందుకు ప్రారంభించాను. గొంతుపట్టుకుంది. నీళ్లకై చేయిచాపాను, కండ్లలో నీళ్లు వస్తూయుంటే. నీళ్ల చెంబు దర్శనమైంది. త్రాగి తట్టుకొన్నాను. ఇదంతా మరుగుననుండి అప్పుడప్పుడు చూస్తూయున్న కన్నెలు పరిహసించులాగు ఒకరి మొగము యొకరు చూచుకొంటూ, చేతులు శబ్దము చేయకుండా తట్టుతూ నవ్వుతున్నారు. భోజనానంతరం తాంబూలాలకుపక్రమించాం. ప్రక్కింటిలో గుడ్డలు నేయు మగ్గం టక్కు టక్కుమని శబ్దంచేస్తూయుంది ఈ విషయమంతా టైపుచేయునట్లు. ఆయమ్మ, యీ యమ్మ యేదో పనిమీదవచ్చినట్లు నటించుతూ నన్నుచూచి వెళ్లుతూయున్నారు. వరుడు వచ్చాడంటే అందరికీ చూడాలని ఉబలాటం యుండటం సాహజం. వరుని యందున్న బాహ్యసౌందర్యాన్ని తిలకించి మురిసి పొయ్యేవాళ్లున్నారు. నవీన పద్ధతులలోని సూటు, బూటు, హేటు నీటుగాయుంటే చాలు 'బలే అబ్బా' యని మెచ్చుకొంటారు. ఇవన్నీ నాకులేవు. యువకునికి అవసరమైన పంచకట్టు, చొక్కాయి, పైగుడ్డ చాల అందంగానే యున్నాయి నాకు. తలుపుప్రక్కన "అతనికి యేమిఉద్యోగం ?" అనే ప్రశ్న వినబడుతూయుంది.

మామగారు, చిన్నాయన ప్రక్కింటికి పొయ్యారు. నేను మంచంమీద భుక్తాయాసం తీర్చుకొంటూ యున్నా నిద్ర పొయ్యేట్లు నటించుతూ. జలజ,. గిరిజ మెల్లగా నడపలోకి వచ్చారు. నేను లేదనుకొన్నారు కాబోలు. నన్ను చూచిన వెంటనే లోపలికి పరుగున వెళ్లారు. మళ్ళా నిద్రపోతూయున్నాడులే యని మాట్లాడుకొంటూ మంచం ప్రక్కన గూటిలోనున్న కుంకం భరిణె ఎత్తుకొని పొయ్యేందుకు మెల్లగా

వచ్చారు. ఒక్క దీర్ఘ నిశ్వాసము వదిలాను. వారు చర చరా వెళ్ళారు లోపలకి.

జలజ గోధుమ వర్ణంగా యుంది. కాటుకకండ్లు, పలుచని మొగం, పొడుగాటి వాల్జెడ. నిరాడంబరతే జన్సు. ఇంటికి పెద్దకుమార్తె. పుష్పవతియై పంచ వర్షాలు పూర్తైనాయి.

గిరిజ నిమ్మపండురంగు. పెద్దకండ్లు, వెడల్పైన మొహం, పొట్టిజడ. నవీన వేషధారిణి. చతురిణి. రెండు వత్సరాలకు పూర్వమే తరుణ వయస్కురాలైంది.

రఘు జలజకు తమ్ముడు, గిరిజకు అన్న. ఇరువ దేండ్లయువకుడు. సతీసంయోగ విలాస కుతూహల పరుడు. ఇంటిలోకల్ల పెద్దకొడుకు. అధికారం హస్త గతం చేసుకొని తల్లిదండ్రులకు విశ్రాంతి కల్పిం చాడు. రఘుమాట మీరేందుకు వారికి గుండెలు లేవు. అందరు రఘుమాటకు తథాస్తు యనవలసిందే. మేము పోయినదే తడవుగా రఘు "జాబు చేరిందా?" అని మమ్ము ప్రశ్నించాడు. ఆ ప్రశ్నే ఆశాజనకంగా యుండింది. రఘుకు, గిరిజకు ఒకేయింట్లోనే వధువు వరులను నిర్ణయించారు. కాని జలజప్రశ్నే చాల గడ్డు సమస్యగా తేలింది. మేనమామగారికై నిరీక్షిం చారు ఐదు వర్షాలుగా-కట్నం ఎక్కువయిస్తారని మోహన్ క్రొత్తచుట్టరికం చేశాడు. కాబట్టే మోహన్‌మాట వదలారు. జలజకు పెండ్లికానిదే రఘుకు, గిరిజకు వివాహమయ్యేందుకు వీలులేదు. పెద్ద బిడ్డ యింట్లో అ వి వా హి త గా నుం టే చిన్నవాళ్ల వివాహానికి ప్రయత్నాలు చేయటంపరిహాసా స్పదంకదూ మరి. అందువల్లనే కాబోలు రఘు నాకు వ్రాశాడు జాబు అత్యవసరంగా. చదివి ఉద్యోగం చేస్తూయున్నానని. నామీద రఘుకు ఎక్కువ మక్కువ. కట్నాలడగనని రఘుకు నామీద విశ్వా సం. నేను బీదింటివాణ్ణి. రఘుకు బీదవాళ్లమీద చాల ప్రేమ. ఎక్కువ ఆశలులేని పేదవాళ్లని చూస్తే రఘుకు అఖితమైన గౌరవం.

రఘు పెద్దనాయన, చిన్నాయనలు, రఘు తల్లి దండ్రులు, రఘు, మా వాళ్లు అందరు చేరారు హాలులో. ఒక్కొక్కరు ఆస్తిపాస్తుల విషయం చర్చించుకొన్నారు. మా చిన్నాయన అతిశయోక్తు లతో మాట్లాడుతూ యుంటే నాకు చాల ఆశ్చర్య మేసింది. కాని "వారిజాక్షులందు వైవాహికములందు ................................బొంకవచ్చు నఘము పొందదధిప" అన్న పద్యం జ్ఞప్తికొచ్చి యూరకున్నాను. పెద్దవాళ్లు చెప్పేదానికంతా తల యూపుతూ..డూ...డూ...బసవన్నలాగయున్నాను. జలజపెదతండ్రి రామయ్య "అబ్బాయిని చూశాము. ఇష్టపడ్డాము. మీయిష్టంచెప్పండి" అని అడిగాడు మా పెద్దలను. మా చిన్నాయనగారు "మాకూ బిడ్డ నచ్చింది." అని చెప్పాడు.

"మీరు ఏమేమి నగలు పెడుతారు మా పిల్లకు?"

"మీరు మీ బిడ్డకు యేమేమి నగలు పెట్టారు?"

"మేము మా బిడ్డకు తొంగటాలు, చేతులకు గాజులు, కమ్మలు, కాళ్లకుగొలుసులు పెడతాం."

"అయితే మిగిలింది మెళ్లోకి గొలుసుఒకటి మేము పెడతాం"

"హెచ్చులేమీ చెప్పొద్దు. శక్తికొద్ది చెప్పండి. మునిగిపోయినదేమీలేదు. వారి, వీరి,నగలు అరువుతెచ్చి తర్వాత వలిచేపద్ధతి యుభయులకు మంచిదికాదు." అని రామయ్యగారు నిక్కచ్చిగా చెప్పుతూయుంటే పెద్దవాళ్ల దగ్గర మా ట యే వి ధం గా యుంటుందో అర్థమైందినాకు. అందులకు మాచిన్నా యనగారు "ఏమండీ! సందేహం? ఇక మీ బిడ్డ మా బిడ్డే కదండీ! ఒక బంగారు గొలుసు పెడతామన్నాము. తప్పక పదిసవరల బంగారుతో రెండుపేటలు వుంచు తాం" అని టెంకాయ కొట్టినట్టు చెప్పాడు.

"వధువు నగలవిషయం పూర్తైంది. ఇక వరుడు విషయం? మా అబ్బాయికి మీ పారితోషికమేమో చెప్పండి?" అని మాచిన్నాయన, రామయ్యగార్ని ప్రశ్నించాడు. రఘు చాల అప్రమత్తతగా యోచిస్తూ

యున్నాడు. ఇంతలో రామయ్య "ఏమండీ! ఎక్కువ గొప్పలు చెప్పం. అల్లుడి గౌరవానికై రూ. 116/-లు చదివిస్తా" మన్నారు.

"ఏమండీ! చప్పగా చెప్పుతూ యున్నారు. బాగుగా ఆలోచించండి. పదిమందిలో గౌరవంగా తిరిగేవాడు. చెప్పుకోనేందుకైనా బాగుండవద్దూ? దీర్ఘంగా మరొక్కమారు ఆలోచించండి" అని సౌమ్యంగా అన్నాడు మా చిన్నాయన. వారందరు లోపలికి పోయారు. ఆలోచించివచ్చి "ఇక మీరు చాల ఎక్కువలకు పోకండి. మాకు మీకు లోటులేకుండా, అర్థవెయిన్ని నూటపదహార్లు యిస్తా"మన్నాడు రామయ్య. మామామగారు చిన్నాయనగార్ని గీరుతూ సమ్మతించమని సైగచేస్తూ యున్నాడు. "ఉండ్రా! నీకేమి తెలుసు? "అన్నట్లు అదోరకంగా చూచాడు చిన్నాయనగారు. మరుగ్గా వీలైనంతవరకు ఆదాయం చూడాలిగా ... మళ్లా పరోక్షంగా ఖర్చుతగ్గించుకోవాలని మా చిన్నాయనగారు వారి తలంపునకు తలపంకించారు సరేనని. "మరి పెండ్లి ఎక్కడ జరపటం?" అని మా చిన్నాయన రామయ్యను ప్రశ్నించాడు. "ఏవిధంగానో మా యింట్లో రెండు పెండ్లిండ్లు జరుగుతూయున్నాయి. అందులోను జలజ పెద్ద అమ్మాయి. ఆమెకుకూడా యిక్కడనే జరిపెయ్యాలని మా అపేక్ష. ఇక మీ ఇష్టంచెప్పండి?"

"రైలు ఖర్చులను గురించి ఆలోచించుతూ యున్నాను–ఇంకేమీ లేదు."

"వారివారి ఖర్చులు వారే భరించుకొంటే సరిపోతుంది" అని రామయ్యగారు వివరించారు. మా వారందరు సమ్మతించారు. ఇకమిగిలింది నిశ్చితార్థం ఎప్పుడని? ... రామయ్య "ఏమండీ! మీరు మా అమ్మాయిని, భూములను చూచారు. ఇల్లువాకిలి పరీక్షించారు. ఇకమేమూ అబ్బాయిని చూచాం. కాని తదితరగృహం పొలం చూడొద్దూమరి? పదహైదు రోజుల్లో మంచిదినం చూచుకొని మేమువస్తాము. అన్నీ చూచి నిశ్చితార్థం చేస్తాం. పూర్వం మనవారు ఏడుజోళ్లు అరిగి పోయ్యేదాకా తిరిగేవాళ్లు. మనమెంతో మెరుగు" అని కథకు కమాపెట్టాడు. మా వాళ్లు కొంత నిరాశతో ఆలోచిస్తూ......"కానీండి మీ యిష్టం ... శుభస్యశీఘ్ర మన్నారు పెద్దలు. ఆలస్యం చేయకుండా రావాలి. మళ్ళీ ముహూర్తాలు లేవు. ఏమి జరిగినా నాగులచవితి ముహూర్తాలలోనే పెండ్లి జరగాలి. కాన అతిత్వరగా మీరువచ్చి పండ్లూపసుపు మార్చుటకు సిద్ధపడాలని" చెప్పి మా చిన్నాయనగారు పొడిని పీల్చాడు. అందరూ లేచాం. రాత్రి భోజనాలు పూర్తైనాయి. ప్రక్కింటి ముసలవ్వ నన్ను వారింటికి పిలిచింది. తాంబూలమిచ్చి "ఏం నాయనా? వచ్చినపని ఐందికదూ? సంతోషం. ఏదో మాకొక విస్తరాకు దొరుకుతుంది. చాలకాలంగా కనిపెట్టుకొనియున్నాం, నీపుణ్యమా అంటూ" అని చెప్పుతూ యుంటే మధ్యలో ఆపి "చాల్లేవ్వా ఆశ! అపద్దగోడి పెండ్లి అయనప్పటికి నిజం" అని నేను చెప్పగా అందరూ పక్కున నవ్వారు. "బలే మాట చెప్పావు! నిజం దాచకుండా పల్కావు" అని ఒకపెద్దాయన నన్ను మెచ్చుకున్నాడు. మరునాడు ఉదయం బయలుదేరి యిల్లుచేరుకొన్నాం. అందరూ "ఏమి? పోయినకార్యం పండా కాయా?" అని ప్రశ్నించారు.

"దోర పండ"ని నేను చెప్పాను.



# సంపూర్ణజీవనానికి సాధనములు

## త్యాగము — వైరాగ్యము

శ్రీమతి నెమలి చంద్రమతిదేవి

మానవ జీవితమునకు త్యాగము ముఖ్యమైన సాధనలో ఒకటి. త్యాగమనిన, గృహము ఆలుబిడ్డలనువిడిచి, సన్యసించి, బికారివలె తిరుగుటకాదుసుమా! అన్నిటిమీద త్యాగభావన కలిగియుండుట, ఇదియే వైరాగ్యము.

వేదాంతశాస్త్రము సన్యాసులకన్న గృహస్థులకే ముఖ్యముగ ఉపయోగకరము. హిమాలయములో, గుహల్లో, ముక్కు మూసుకొని కూర్చునిన విరాగులకొఱకో ఏర్పడినదని, మనము తలంపరాదు. వేదాంత శాస్త్రము గృహస్థులకొఱకే ఉద్దేశింపబడినదిగా తెలియుచున్నది.

ప్రతి గృహమునందు భర్త భార్యను సంతోషపెట్టవలెననియు, భార్య భర్తను సంతోషపెట్టవలెననీయు, ప్రయత్నించుచుండును. కాని దాని ఫలము యిద్దరును అధోగతికి లాగుకొనిపోవుచున్నారు. ఈ నేరము వారిదకాదు. అజ్ఞానమే కారణము. అందువలన కష్టములు దుఃఖములు కలుగుచున్నవి.

భార్య పిశాచమై ఏవో నాలుగు తళుకు, బెళుకు నగలను, ఆడంబర వేషములను ఆశించి, తన ఆత్మను నాశనము చేసుకొనుచున్నది. భర్తయు నట్లే వర్తించుచున్నాడు. తన భార్యను తన కంటే వేఱగు వ్యక్తిగా భావించుచున్నాడు. తనకుగాను ప్రత్యేకింపబడిన, భోగవస్తువుగా ఎంచుచున్నాడు. అందువల్లనే, తీరని దుఃఖములు కలుగుచున్నవి. భర్త భార్యను బానిస, భార్య భర్తను బానిసగ ఎంచుకొనెదరు.

భార్యాభర్తలు యిరువురును తమలో ఎవరికి ఎవరు ఏమి ఇత్తురా అని దేవురించుచు చూడక, ఎల్లప్పుడు పరోపకార చింతకలిగి దాతలుగా నుండుటే గృహస్థులు ఆనందమును పొందకలుగు రహస్యము.

సరే దేనిని దానమిచ్చుట? దాని కర్హమైనవస్తువేది? భార్యగాని, భర్తగాని సాధ్యమైనంతవఱకు జ్ఞానమునే దానము చేయుచుండవలెను. భార్య తన భర్తను, భర్త తన భార్యను పవిత్రవంతముగ చేయ కలిగినపుడే తమ ధర్మమును తాము నిర్వర్తించినట్లగును. దీనిని గురించి ఒక కథ యున్నది.

పూర్వము ఒక రాజు బ్రహ్మ జ్ఞానము పొందనెంచి, గృహస్థాశ్రమము విడువదలచి, తన రాజ్యమును, భార్యాబిడ్డలనువదిలి హిమాలయములకు వెళ్ళెను. తన భార్య ఎంత చెప్పినను వినక, రాజ్యము భార్య కప్పగించి వెళ్లిపోయెను. ఒక సంవత్సరము గడచిన తరువాత భార్య తన భర్తకు శాశ్వతానందము కలుగునుపాయ మాలోచింపసాగెను.

ఒకనాడు ఆ రాణి సన్యాసివేషము వేసుకొని భర్తయున్న పర్ణశాలకువెళ్లి, ఆయన ధ్యానముచేయుచుండగా ప్రక్కనపోయి నిలిచెను. కొంతసేపటికారాజు కండ్లు తెఱచి తన ప్రక్కనున్నది ఒక గొప్ప సన్యాసి అనుకొని తన్నుద్ధరించుటకు వచ్చిన భగవదవతారమా అనుకొని పూజచేసి నమస్కరించెను. ఆ రాణి యప్పుడు భక్తి పరవశయై దివ్యజ్ఞానము పొందెను. రాజు సన్యాసిని జ్ఞానదానముచేయమని కోరెను.

రాణి:-రాజా నీవు సంపూర్ణానందమును పొందగోరెదవేని సర్వపరిత్యాగుడవు కావలెను.

రాజు:-(ఆశ్చర్యముతో) నేను రాజ్యమును, భార్యను, బిడ్డలను పరిత్యజించియే వున్నానే!

రాణి:-నీవేమియు త్యజించలేదు; విరాగివి కాలేదు. నీ కింకేమియూ లేదా ?

రాజు:-అవును నాకీపర్ణశాల యున్నది. ఈ దండము, కమండలమువున్నవి.

రాణి:-కనుక నీవు విరాగివికావు. నీకేమైన వున్నంతవఱకు నీవు దాని వాడవే అగుదువు. నీకు స్వాతంత్ర్యములేదు అనెను. అంతనారాజు గుడిసెను తగులబెట్టి, దండ కమండలములను నదిలో పాఱవేసెను.

రాజు:-ఇప్పుడు నేను విరాగినికదా ?

రాణి:-గుడిసెను తగులబెట్టి, వాటిని పారవేసినంత మాత్రాన నీకు వైరాగ్యము లభింపదు. రాజా ఇంకా నీకు మూడు మూరలన్నర శరీరములేదా ? ఊరికే ఆ వస్తువులను నాశనముచేసితివి, అది తప్పు! దానివల్ల నీకు వచ్చిన మేలు లేదు. ఈ మూడు మూరలన్నర రేగడిల్లు నిలిచియే వున్నదిగా!

అంతట నారాజు తన శరీరమును దగులబెట్టతలచి, ఒక చితిపేర్చి నిప్పు రగులజేసెను. అగ్నిలో దుముకుటకు సిద్ధపడెను. అప్పుడు భార్య అడ్డగించి ఇట్లు చెప్పెను.

రాణి:-రాజా నీ శరీరము దహనముచేసిన వెనుక ఏమియు మిగులదా ?

రాజు:-బూడిద మిగులును.

రాణి:-ఎవరి బూడిద ?

రాజు:-నాబూడిదయే.

రాణి:-అట్లైన అప్పుడును నీ బూడిద మిగిలియేవున్నది కాబట్టి నీ శరీరమును తగులబెట్టినా నీవు విరాగివి కాజాలకుందువు.

రాజు:-అట్లైన విరాగినగుటెట్లు?

రాణి:రాజా ఇదెవరి శరీరము?

రాజు:-నాశరీరమే.

రాణి:-సరే దానిని త్యజించుము. అందున్న మనస్సు ఎవరిది?

రాజు: నామనస్సే.

రాణి:-అట్లైన దానిని పరిత్యజింపుము.

రాణి ఈ తీరున రాజును విచారణ చేసెను 'నేను' అనగా నెవరు? 'నేను' మనస్సునుగాక, శరీరమునుగాక మనసుకతీతముగనే, వున్నాను. తుదకు ఆయన "నేను దేవదేవుడనే, సర్వసంపూర్ణుడను, శాశ్వతబ్రహ్మమును" అని భావించెను. ఇతర పదార్థములన్నియు త్యాగముచేసినను, ఈ పరిపూర్ణశాశ్వత బ్రహ్మమును త్యాగము చేయ వీలు పడనిదని రాజు తెలుసుకొనెను. అహం - 'నేను' అన్న భ్రాంతినే, నేను విడువవలసినదని తెలుసుకొనెను.

బైరాగులై అడవికిపోయినా, విరాగులు కాకపోవచ్చును. కొందరు రాజులు సుందర హర్మ్యములందు వసింపుచు, ఇట్టి త్యాగభావము కలిగియుండిరి. మమకార భావము త్యజింపజాలిన వారే విరాగులు కాగలరు.

ఇట్లు రాజు జ్ఞానియగుటకు తోడ్పడుచు, రాణి కొంతకాలమచటనుండెను. ఒకనాడు తన మారువేషమును తీసివేసి, తాను పాతివ్రత్యభంగము కావించినందుకు తన్ను మన్నింపుమని, రాజును వేడుకొనెను. "నేను మిమ్ము మోసగించినందుకు నన్ను క్షమింపుడు; నా ప్రార్థన ఆలకింపు"మని కోరెను.

రాజు "ఎందుకా క్షమాపణ? నేను ఈ శరీరమని, నీవు నాయీశరీరానికిభార్యవని, నాస్వంతమని, భావించినట్లైతే, నాకు బాధాకరముగానే వుండును. కానీ నాకిప్పుడీ శరీరములోని భర్తఅను భావము లేదు. నా చేతులతో నేను పగ్గాలను లాగి పట్టలేదు. నేను ఎవరివాడనుకాను. నేనఖండపరిపూర్ణుడను. ఇట్లు నీవును స్మరింపుమనెను. రాణి తన రాజ్యమునకు పోయి కొంతకాలమునకు తిరిగివచ్చి, "ఓ రాజా నీవిప్పుడు సాక్షాత్ భగవంతుడవే, ఎక్కడున్నను ఏమి భేదము? నీ సౌధములకన్న ఈ హిమాలయములు నీవి కాగలవా?" అనెను

రాజు:-నేను సర్వత్రనున్నాను. అన్ని శరీరములు నావె; జ్ఞానదృష్టికి శరీరము కాన్పించదు. సత్యము గ్రహింపని వారికే

ఇది కాన్పించును...పిమ్మట రాణి రాజును రాజ్యములోనికి తీసుకొనిపోయినట్లు కథ తెలియుచున్నది. అతడప్పుడెట్లున్నాడు? సమస్తమును అశాశ్వతమను ఆరూఢ జ్ఞానము కలిగి ఇంద్రియములకు దాసుడు కాకుండ, సమస్త వైభవముల నడుమ, ఇరువది ఐదు సంవత్సరములు వాసము చేసెను. అతడు రాజుకాడు. చక్రవర్తి కాడు. సాక్షాత్ భగవంతుడే. వైరాగ్య మనగా ఇటువంటిది. నిజమగు విరాగికి, గులకరాళ్లు – నవరత్నములు, ముండ్ల కంపలు - పట్టుపఱుపులు, రాజప్రాసాద ములు - పూరిగుడిసెలు, సమములై కాన్పించును. గృహస్థధర్మము, వైరాగ్య సాధనమందు, క్రమశిక్షణమై, మహోప కారము చేయగలదు. భార్యాభర్తలు, వొండొరులకు సహాయముచేసికొనిన, తమ గృహమును, స్వర్గముగనొనర్పజాలుదురు. సంసారత్యాగము వైరాగ్యమనబడదు. దానివలన ఫలము ఏమాత్రము కలుగదు. బలాత్కారపు త్యాగములు నిష్ఫలములు.

సామాన్యనరులకు, కుటుంబసంబంధ ములు అవరోధములుగ తోచవచ్చును. కానీ, భార్యా బిడ్డలు, బంధువులు నీకు సహకారులేనని, రామతీర్థుడు చెప్పి యున్నాడు. శరీరారోగ్యము కొఱకు వ్యాయామమెట్లవసరమో, బ్రహ్మజ్ఞానము పొందుటకు, కుటుంబబంధమట్లవసరము.

వైరాగ్యమనగా ఇప్పుడు అర్థమేమిటి? అన్నివస్తువులను అన్ని సంబంధములును వదిలి వేయుటకాదు వైరాగ్యమనగా, ప్రతివస్తువును పవిత్రవంతముగ భావన చేయుట. బిడ్డనుగూర్చి వైరాగ్యము కలుగుట, భార్యనుగూర్చి వైరాగ్యము కల్గుట,అయిన వారలతో సంబంధ బాంధ వ్యములు వదలి వేయుటకాదు. వారలలో నున్న ఆత్మస్వరూపుడగు భగవంతుని సాక్షాత్కారమునకు తెచ్చుకొనుటే వైరాగ్యము. శత్రువులోగాని, స్నేహి తునిలోగాని, దేవదేవుని దివ్యకళను గుర్తించమని చెప్పియున్నది.

పవిత్రవంతమైన సంతానమును బడయ తలచిన భార్యభర్తల హృదయములు, పరమ పవిత్రవంతముగచేసి తుచ్ఛభోగ ముల కాశపడక, త్యాగవైరాగ్యములు కలిగి,సదాభగవద్భక్తులై,సర్వాత్మయందు మగ్నులై, విజ్ఞానవిధులైయుండిన, వారి పావన జీవితమహిమ, వారివున్నత భావ ములు, వారి పవిత్ర సంకల్పములు, వారి సంతానమందు ప్రతిఫలింపక తప్పవు. అటువంటి వారి సంతానము నుండియే, కృష్ణులు, క్రీస్తులు, బుద్ధులు, మహాత్ము దులు, గాంధీలు, బయలుదేరగలరు.

ఇట్లు సంపూర్ణ జీవనానికి, త్యాగ, వైరాగ్యములు తోడుపడుచున్నవి.






## మామిడికాయ షరబత్

పచ్చిమామిడికాయలు నిప్పులో కాలేయవలెను. మెత్తగా కాలిన తరువాత ఒక కళాయి గిన్నెలో నీళ్లుపోసి కాలిన కాయలను నీళ్లలో పిసకవలెను. ఆ నీళ్లను ఒక పలచని గుడ్డలోపోసి వడపోయవలెను. అందులో ఒక కప్పుకు రెండు టీస్పూనుల పంచదార వేయవలెను. ఒక మామిడికాయకు రెండు కప్పులు షరబత్ అగును. పెద్దకాయ అయినచో నాలుగు కప్పులు అవుతయి. ఈ లెక్కన మనకు యెన్ని కప్పులు కావలిసిన అంత చేసుకొనవచ్చును. ఇందులో యాలకులపొడి, ఒక డజను కప్పుల నీళ్ళకు ఒక పౌను ఐసుగడ్డ వేయవలెను. ఈ షరబత్ వేసవికాలంలో మనిషికి కప్పు త్రాగిన చల్లగావుండును. వడగొట్టినవారికిఇస్తే హాయిగా వుండును.

టి. కృష్ణవేణి

## కోవా కజ్జికాయలు

మూడుకొబ్బరికాయల తురుము, అరవీశ బెల్లము, 8 యాలక్కాయలు, 3 గిద్దెల పంచదార, సోలెడు పాలు సిద్ధంచేసి యుంచుకొనవలెను. మొదట బెల్లం పాకంపట్టాలి. అందులో కొబ్బరి తురుముపోసి బాగా కలియకలుపవలెను. అది ముద్దయగుచున్నప్పుడు సువాసనవచ్చును. అప్పుడు దానిమీద యాలకుగింజల పొడిని చల్లాలి. దానిని పొయిమీదనుండిదింపి ఉసిరికాయంత ముద్దలుగాచేసి ఒక బేసిన్‌లో నుంచవలెను. ఒక పాత్రలోపాలు, పంచదారకలిపి పోయిమీదనుంచి పదిసార్లు తెర్లనిచ్చిన తరువాత దించి పప్పుగుత్తితో వెన్నలాగ అయ్యేదాక చిలకాలి. దానిని కొబ్బరి ముద్దలకు చుట్టూ అతికేలాగచేసి, ఆరితే తెల్లగానుంటవి. రుచికరమైనదేకాక బలవర్ధకమైన ఆహారంకూడాను.

## వెన్నగోలీలు

సోలెడు బియ్యపు పిండిలో నిమ్మకాయంతవెన్న, చాలినన్ని మజ్జిగపోసి గట్టిగా కలుపాలి. దానిని గోలీప్రమాణంలో ఉండలుచేసి యుంచుకొని పొయ్యిమీద బాణలిలో నెయ్యిపోసి కాగిన తర్వాత అందులో యీ యుండలనుపోసి వేవవలెను. వానిని ఒక పళ్లెంలోనుంచి ఆరనివ్వవలెను. సోలెడు చక్కెర కొంచము నీళ్లుపోసి ఒక కళాయి పాత్రలో ఉడికించి పాకము పక్వమునకురాగానే పళ్లెంలోని గోలీ ఉండలను అందులోపోసి కలియబెట్టాలి. తరువాత పొయిమీదినుండిదించి బాగా చల్లారే వరకు కలియదీస్తుండాలి.

వీని తయారు సందర్భమున బియ్యపుపిండి అప్పటికప్పుడు కొట్టినదిగా నుండవలెను. లేకున్నచో యీ ఉండలు పగిలిపోతవి.

సూర్యదేవర రాజ్యలక్ష్మి

# ఏజంట్లు కావాలి!

బొంబాయి, హైదరాబాద్, సికందరాబాద్, విశాఖపట్టణం, కర్నూలు, గుంటూరు, బాపట్ల, ఒంగోలు, చిత్తూరు, కడప, గూడూరు, తిరుపతి, బరంపురం, బెంగుళూరు – యింకా యితర ప్రదేశాలలో మాపత్రికలు అమ్మబడని చోట్లలో తమస్వంత బాధ్యతపై అమ్ముటకు ఏజంట్లుకావలెను.

ఏజంట్లుగానుండగోరువారికి రు 100/-కి రు 20/-లు కమీషను, ఒక ఫ్రీకాపీ యివ్వబడును. ఇతర వివరములకు వ్రాయండి!

మా పత్రికకు అడ్వర్టైజుమెంటులను కాన్వాస్ చేయువారికి మంచి కమీషను సదుపాయాల నివ్వగలము.

## గృహలక్ష్మి కార్యాలయం

రాయపేట, మద్రాసు 14.

---

పాత్రుడుగారి

# బాలసంజీవిని (Regd)

పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును

## డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,

19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 85254.

కుంభకోణము బ్రాంచి:

1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.

# ముసిముసినవ్వులు

'నారపీచు'

ఒక యింటి దొడ్డితలుపుతట్టూ తాపీపనివాడు "ఇక్కడే కదండీ! వంటయిల్లు మరమ్మతు చేయించాలని కబురుచేశారట" అన్నాడు.

తలుపుతెరుస్తూ యింటావిడ "వారం రోజుల క్రిందట కబురుచేస్తే యిప్పుడా నీవు వచ్చేది."

"క్షమించండి! నేను వెదకుతున్నది 15 రోజుల క్రిందట నాకొరకు కబురు చేసినవారి యింటికొరకు."

♦ ♦ ♦ ♦

ఒకాయన దారిన వెళుతున్న మరొకాయన వీపుతట్టూ "విఠల్‌బాబూ! యిలా మారిపోయావేమిటి! నేను నిన్నుచూచి నెలరోజులుకాలేదు! - యీ లోపల 30 పౌనుల బరువు పెరిగిపోయినట్లున్నావే! - పొడుగుకూడ పెరగడం ఆశ్చర్యంగానుంది" అన్నాడు.

మరొకాయన కోపంగా "పొరబడుతున్నారు-నేను రమేష్‌ను - విఠల్‌బాబును కాను."

"అయితే పేరుకూడ మారిపోయిందన్నమాట."

♦ ♦ ♦ ♦

"మా తాతగారి తుపాకి చూచినప్పుడల్లా యుద్ధరంగాని కెళ్ళాలనే ఉత్సాహం కలుగుతుంటుంది."

"మంచిది."

"కాని మా తాతగారి కొయ్యకాలు మాత్రం నిరుత్సాహపరుస్తుంటుంది."

♦ ♦ ♦ ♦

"మావారు నన్ను వివాహమాడేనాటికి విపరీతంగా పొగత్రాగేవాడు. ఇప్పుడు పొగాకు కాడనుకూడ దగ్గరకు రానీయడు."

"చాల మంచిది! చాలకాలమునుండి అలవాటుపడియున్నదానిని మానడానికి ఆత్మబలం గొప్పదిగానుండాలి."

"అదే నాకున్నది."

# తలవని తలపు

శ్రీమతి డి. సరస్వతి

సాయంత్రం నాలుగున్నరయింది. మామూలుగా షికారు వెళ్ళడానికి ఆదరాబాదరా గుక్కెడు కాఫీ నీళ్ళు నోట్లోపోసుకొని గోపీఇంటికి బయల్దేరాడు రఘు. ఆనాడు గోపీ ఇంట్లో అంతా హడావుడిగా ఉంది. ఏమిటా - అని లోపల ప్రవేశించడంతోటే గోపీ యెదురై

"హల్లో ! రఘూ ! కమాన్, కమాన్" అంటూ ఆహ్వానించాడు.

"ఏమిటోయ్, ఈ వేళ అంతా హడావుడిగా ఉందే!"

"ఏమి లేదోయ్. ఈ వేళ మా చెల్లెల్ని చూడ్డానికి పెళ్ళివాళ్ళొస్తారు. నీవ్వూకూర్చో" అంటూండగా ఇంతలో "గోపీ" అన్న పిలుపువిని వెళ్ళిపోయాడు గోపీ;

ఐదుగంటలకల్లా వచ్చారు పెళ్ళివాళ్లు. వాళ్ళకి చేయాల్సిన సత్కారాలన్నీ ఏలోటు లేకుండా చేసారు రావుగారు. అంతాలోగిట్లో కూర్చొని కాస్త "పిచ్చాపాటీ" మాట్లాడుకొన్నారు.

"ఏమండీ ! అమ్మాయిని కొంచెంపిలుస్తారా" అన్నాడు పెళ్ళిపెత్తనాని కొచ్చిన ఒకపెద్దమనిషి. కాల విలంబన మెందుకని 'దానికేం' అనిరావుగారు లేచి, అప్పటికే ముస్తాబై తయారుగానున్న కూతుర్ని తీసుకరమ్మని, భార్యతో అని తిరిగివచ్చేసాడు. కొంత సేపటికి ముందుతల్లి, వెనుక అమ్మాయి వచ్చి అక్కడ తిన్నగాకూర్చొన్నారు. పెళ్ళివాళ్ళంతా కళ్లుపెద్దవి చేసి బాగా పరిశీలించారు. అన్ని విధాలా అమ్మాయి నచ్చినట్లేనని వారి ముఖ చిహ్నాలుపట్టి కనిపెట్టొచ్చు.

"అమ్మాయికి సంగీత మేదయినా వచ్చా?"

"ఆ, ఏదోకాస్త నేర్చుకున్నదండీ. వీణకూడ వాయిస్తుంది. ఏదీ ఒక పాటపాడమ్మా!" అని రావుగారంటూండగనే గోపీ వీణ తెచ్చి చెల్లెలికందించాడు. అమ్మాయి మొదట కొంచెం సందేహించి సిగ్గుపడ్డా "పరవాలేదు పాడమ్మా" అన్న తండ్రి వాక్యాలతో కొంచెం ధైర్యం తెచ్చుకొని, వీణమీటి రాగాలాపనచేసి త్యాగరాజు కృతి నొకదానినందుకొంది. ఆమెమృదువైన వేళ్ళతో వీణమీటుతూ కమ్మనికంఠంతో పాడ్తూంటే, స్వర్గసీమలో తేలి యాడునట్లె తన్మయుడయాడు రఘు. ఆమె పాటనిలిపి వెళ్ళి పదినిమిషాలైనా పాటమాత్రం రఘు చెవుల్లో గింగురుమంటూనే ఉంది. పెళ్ళివాళ్లు చాల సంతోషించారు.

"అమ్మాయి అన్నివిధాలానచ్చింది. మరి మా అబ్బాయికూడ ఒప్పుకొన్నట్లే. అయితే...వాడుపై చదువులు చదవాలని చాల అభిలాషపడ్తున్నాడు. ఇప్పటికే మా పనయిపోయింది. ఎల్లాగో కష్టపడి "ఇంటర్" దాకా చదివించాము; "చదువుచాలు బాబూ" అంటే వాడువినేట్టులేదు. దానికేదైనా కొంచెం సహాయం చేస్తే బాగుంటుంది." అని తన అభిప్రాయాన్నంతా ఒకగుక్కలోచెప్పేసాడు పెళ్ళి పెత్తనానికొచ్చిన పెద్దమనిషి. ఇవన్నీ వింటూన్న రావుగారి గుండెలు నీరైపోయాయి. ఏమి మాట్లాడాలో తెలియడంలా. ఎట్లో మాటతెచ్చుకొని "దానికేం చెయమన్నారండీ"అన్నారు రావుగారు.

"ఆ...మీకు తెలియందేముందండీ. చదువుకొన్నవారు, పదిమందిలో మెలిగినవారు. చూడండీ-ఎంత సర్దుబాటు చేసుకొన్నా కనీసం 6, 7, వేలయినా లేందే ఈ కాలంలో బి. ఏ. పూర్తికాదు.

అందుకని మీరేదైనా......ఒక ఐదువేలిచ్చారంటే, మిగత దెట్లో మేంసర్దుకొంటాం”

రావుగారికి గుండె ఆగిపోయేటంతపనైంది. ఒక్క కానీయైన చేతిలోలేని బడిపంతులు ఐదు వేలెట్లిస్తాడు! ఇవ్వకపోతే కూతురి పెండ్లినాశనం. అందులో ఇప్పు డొచ్చింది నాలుగోసంబంధం. ఇదికూడ తప్పిపోతే తనకూతురు గతేంకావాలి? అయితే ఐదువేలివ్వడం ఎట్లా? ఈ ఆలోచనలన్నీ అతని తలలోనైళ్ళు పరిగెత్తినై. ఎట్లాగోమనస్సును చిక్కపట్టుకొని ఇవ్వక తప్పదుగదాయని—

“ఏమండీ, ఐదువేల సొమ్మెచ్చటనుండి ఇవ్వగలం? ఏదో ఒక రెండువేలైనా, ఏలాగో ఒకలాగు సర్దుబాటు చేయడానికి ప్రయత్నిస్తాం. అంతకు మించి మీరడగటం.........” అంటుండగనే మధ్యలో “అయితే లాభంలేదండీ. దానికి తక్కువైతే ఆలోచించాల్సిందే. అమ్మాయి మాత్రం చాలా బాగుంది. అయితేమాత్రం......ఆలోచించండి రావుగారూ!”

“ఆలోచించడమేముందండీ. ఐదు వేలివ్వడం అసాధ్యమేననుకొంటాను”

“అయితే మేం వెళ్ళొస్తామండీ”

“వెళ్తారా.........”

“వెళ్ళకేం చెయమంటారండీ” అంటూ పెళ్ళివాళ్ళందఱూ లేచి చెప్పకుండానే కట్నప్రవాహంలో పడికొట్టుకుపోయారు. రావుగారు నిశ్చేష్టుడై అట్లే కూర్చుండి పోయారు లేవడానిక్కూడా శక్తిలేకుండా. తలుపుచాటునుండి ఇదంతా చూస్తున్న “కమల” కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. గబుక్కున రెండు చేతుల్లో ముఖంమూసుకొని అచటనుంచోలేక వెళ్ళిపోయింది. పాపం అంతకంటే ఆమె చేయగలదేముంది? ఇదంతా చూస్తున్న రఘుకు మతిపోయినట్లైంది. ఇక అచటకూర్చోలేక తిన్నగా ఇంటికొచ్చి కుర్చీలోకూల పడ్డాడేగానీ, మనస్సు కుదుటబడలేదు. సంఘంలోని దురాచారాన్ని, ధనాశల్ని తలచుకోగానే అతని హృదయం బరువెక్కింది. “పాడుసంఘం ఏవేవో

---

ఒక కేసు విచారణ సందర్భమున జడ్జి ప్రతివాదిని “గడచిన ఆరునెలల కాలంలో నీవు భార్యతో మాట్లాడకుండాయున్నది నిజమేనా” అని అడిగాడు.

“నిజమేనండీ; ఆమె ధోరణికి అంతరాయం కలిగించడం నా కిష్టం లేకపోయింది”

---

ఆచారాల్ని చట్టాల్ని కల్పించి అమాయకులైన ప్రజలను కష్టాలకుగురిచేసింది. ఎవరోకొందఱు స్వార్థపరులు, స్వలాభాలకై, వరకట్నాది దురాచారాల్ని సంఘంలో ప్రవేశపెట్టి, ఎంతమంది నిండు జీవితాల్ని, సౌఖ్యాల్ని పాడుచేస్తున్నారు! అందులో మన దేశంలో స్త్రీల విషయం తల్చుకొంటే కడుపు తరుక్కుపోతోంది. వాళ్ళకి జరిగే వన్నీ అన్యాయాలే. విద్యా, బుద్ధీ, అందం, కలిగుండీకూడ డబ్బులేదన్న సాకుతో కమలలాంటి అమాయిక జీవితాలు నాశనం కావల్సిందేనా? ఆకంఠ మాధుర్యం, యవ్వనం, అందం కరిగిపోవాల్సిందేనా? పోనీ కమలను పెళ్ళిచేసుకొంటే......ఇలా ఎన్నో ఆలోచనలు అతనిలో పుట్టుకొచ్చినాయి. కడకు ఏమైతేనేం—కమలని పెళ్ళాడ్డానికే నిశ్చయించాడు రఘు. మనస్సు కొంచెం కుదుటబడ్డది.

౨

రావుగారొక గ్రామంలో ఎలిమెంటరీ స్కూల్ హెడ్మాష్టరు. నెలకో అరవైరూపాయల జీతం వస్తుంది. దాంతో సంసారాన్ని గడుపుకొంటూన్నారు. భార్యా, ముగ్గురు కూతుళ్ళూ, ఒక కొడుకు ఇదే అతని సంసారం. కొడుకు గోపీ బి. ఏ. చదువుతున్నాడు. పెద్ద కూతురు “స్కూల్ ఫైనల్” దాకా చదివి ఇప్పుడింట్లోనేఉంది. సుమారు

పదహారేళ్లుంటాయి. నవ యవ్వనం తొణికిసలాడుతూంది. సుందరాకారమే. ఆమెయే మన పెళ్లికూతురు కమల. ఆమె కిదివరకు మూడు సంబంధాలొచ్చాయి. ఇప్పుడొచ్చింది నాలుగో సంబంధం. అందరూ కట్నం విషయంలోనే పేచీపడి పెదవి విరిచి వెళ్లి పోయారు. కూతురు పెళ్ళి విషయం ఎంతో ప్రయత్నించారు రావుగారు. కానీ ప్రయోజనం లేక పోయింది. ఇక కూతురికి పెళ్ళి కాదనే నిశ్చయించుకొన్నారు పాపం వారు. రఘు మిక్కిలి ధనవంతుడు కాకపోయినా కొంచెం పైతరగతివాడు. బి. ఏ. ఎల్. టి. ప్యాసయి వేసవి సెలవుల్లో, మేనమామగారి గ్రామానికదే మొదటిసారిగా వచ్చాడు. అది కొంచెం చిన్న గ్రామం. అందుచే, వార్తాపత్రికలకో, లేక షికారు వెళ్ళటానికో రావుగారింటికి వస్తూండడముచేత, వారికి పరిచయమెక్కువైంది. ప్రతి దినం రఘు, గోపీలు కలిసి షికారు వెళ్ళేవారు. తఱచు కమల కూడా రఘుతో మాట్లాడుతుండేది.

పెళ్లివారువెళ్ళి రెండు రోజులయింది. మూడో రోజు సాయంత్రం తన నిశ్చయాన్ని గోపీకి తెలియచేస్తామని గబగబా బయల్దేరాడు రఘు గోపీ యింటికి. అప్పుడే రావుగారు ట్యూషన్‌కు వెళ్ళేరు. ఆయన భార్య పక్కింటికెళ్లింది. ఇంట్లో కమల ఒక్కతేవుంది.

“గోపీ” అంటూ ప్రవేశించాడు రఘు.

“గోపీ బజారు కెళ్లాడండీ. మీరొస్తే కాస్త కూర్చోమని చెప్పిపోయాడు” అని తలుపుచాటు నుండే జవాబిచ్చింది, అవమానభారంచేత కుమిలిపోతూ కమల. ఇదే సమయమనుకొని రఘు “కమలా” అన్నాడు. కమల ఉలిక్కిపడింది. “కమలా” అన్న పిలుపు ఆమె హృదయంలో ప్రతిధ్వనించింది.

“నేనొకటడుగుతున్నా, కోపించకుండా జవాబిస్తావుకదూ.”



"కోపమెందుకండీ" అన్నది లేని ధైర్యం తెచ్చుకొని కమల.

"హృదయపూర్వకంగా చెప్తున్నావా? అడగొచ్చా?"

"ఊఁ ... ... ..."

" ... ... ... ... ... "

" ... ... ... ... ... "

"నిన్ను వివాహమాడ దలచుకొన్నా."

"నన్నా!" అని కమల ఆశ్చర్యంతో ఏమో చెప్పదలచుకొంటుండగనే గోపీ ప్రవేశించాడు. జవాబివ్వకుండానే లోపలి కెళ్లింది కమల. గోపీ, రఘూలుకలిసి షికారు వెళ్లారు.

కమల ఆ రాత్రే ఈ విషయం వాళ్ల నాన్నకు చెప్పింది. ఇంకేముంది! రావుగారానందభరితుఁడై వెంటనే రఘూదగ్గఱకెళ్లి అన్నీ నిశ్చయించుకొన్నారు. వారంరోజులకల్లా "కమలా రఘు"ల పెళ్లి అతి వైభవంగా జరిగిపోయింది. ఇప్పుడు రఘు అత్తవారింట్లోనేఉండి ఉద్యోగంకోసం ఎదురు చూస్తున్నాడు. అనుకొన్నట్టుగానే మఱో వారం రోజులకల్లా వచ్చింది ఉద్యోగం. ఆ సంతోషంతో "వచ్చిందండీ, వచ్చిందీ" అని పాడుకొంటూ కమల గదిలోకి ప్రవేశించాడు రఘు.

"ఏమిటండీ వచ్చింది" అనింది కమల.

"ఏమొచ్చిందో కనుక్కో చూద్దాం."

"నాకు జోస్యము తెలీదండీ" అన్నది నవ్వుతూ కమల.

"ఉద్యోగం వచ్చింది" అన్నాడు వొయ్యారంగా.

"ఉద్యోగమే! ఏ ముద్యోగమండీ?"

"స్కూళ్ళ డెప్యూటీ ఇనస్పెక్టరు"

"అయితే! ఇంకేం. మా నాన్నపై అధికారం చలాయిస్తారన్నమాట!"

"ఆ. అవును. నేను మీ నాన్నపైన. నీవు నాపైన" ఇద్దఱూ కిలకిల నవ్వుకొన్నారు. టేబిల్ పైనున్న అలారం టైమ్‌పీస్ గణగణా మ్రోగింది ఆమోదాన్ని తెలియచేస్తూ. వారి నవ్వులు దానిలో లీనమైనాయ్.

---

"డాక్టర్ గారూ! నాకు ఆరోగ్యం చక్కబడుతుందని గట్టిగా నమ్మితే జబ్బు నయమగుతుందని కదూ మీ యభిప్రాయం."

"అవునమ్మా."

"అయితే మేము మీకు డబ్బిచ్చేశామని మీరు నమ్మితే మేము మీకిస్తామనేది ఖాయమేకదండీ!"

"అదెలాగవుతుంది"

"నమ్మకమనేది మీకొకలాగ, మాకొకలాగుంటుందేమిటి"

"వ్యాధిస్వస్థత పట్లయుండే నమ్మకమునకు, మీ యడల నాకుండే నమ్మకమునకు భేదమున్నది"

♦ ♦ ♦

"ఏమండీ! మా చెల్లెలికి పంపిన మందుల పార్సలులోని సీసాలన్నీ పగిలిపోయినవని జాబువచ్చింది. పంపేటప్పుడు పైభాగాన్ని సూచించే కాగితాన్ని పెట్టె పైభాగమున అతికించారా"

"సందేహమేమిటి! —ఒకటికాదు— పెట్టె నలువైపులా అతికించాను"

# అచ్చకు మచ్చ బుట్టునా?

శ్రీమతి గాడిచెర్ల సుబ్బాయమ్మ



మణిపురీశుమంత్రి ధీరవర్మ తనదు-భార్య మంజుల గూడి యింపలర బ్రీతి
గా పురంబుండు నొకనాటి కాలమందు-జూచె నా రేడు మంజుల సోయగంబు.

రాజు తన్నుజూచె నంచు యా రాటమొంది పతికి జెప్పుట కెంతయు భయముజెంది
ఏమి కీడొనరించునో యేమొ యనుచు-మసలుచుండెను చెదరిన మనముతోడ.

మంజులనుజూచి భూపతి మానసమున-తలచె తనభార్యకంటె సుందరి యటంచు
మంత్రిభామినిపై రేడు మనసు నిల్పి-మోహావశుడయ్యె నారాజు మూర్ఖుడగుచు.
ముందుగా మంత్రి గజయూధములను దేగ-నాజ్ఞ యిడి ఘోరవనముల కతని బంపి
జాగుసేయక నయ్యెంతి జతనుగోరి-శీఘ్రముగ నేగె భూపతి, చెలియ గూడ.

తలుపు తట్టినయంత, తరుణి తా భయమొంది-యెవరు వాకిట పనియేమి యనగ
మణిపురాధీశుడ, పనియుండివచ్చితి-నను మాటవిని, గుండెలదుర బలికె
బావ లేరుగదన్న వన గజంబుల కొరకు-యేగుట తెలియదా, యేమియన్న
పలుకాలకించి నీ భావంబు దెలిసితి-పొరపాటు జేసితి, పోయివత్తు.

ననుచు విడియంబు విడిచితా, నాత్మయందు-సోదరిగ నెంచి సన్నించి, యాదరమున
యామె నేర్పిన పాఠంబునందు బుద్ధి-నిలిపి వీడెను తనలోని మలిన గుణము.

మదగజంబుల దొడ్కొని మంత్రివచ్చె-తనదు వాకిట జూచెను తమ్మనపుడు
మనసులో భార్యపై యనుమానమొంది-తండ్రికడకంపె నొకయరదంబు నిచ్చి.
కట్టుకొన్నట్టి వానిచే పుట్టినింటి-కంపబడె మంజుల యటంచు మానసమున
జులకనగ బంధుజనులెల్ల చూచుచుండ-కష్టముగ కాలమెట్టులో, గడుపుచుండె.

నిండుపున్ననిశి, నెగడు చంద్రుని జూచి-అచ్చముగను వెన్నెలచ్చువోసి
నట్టులుండె నంచు, నామంజుల స్వజ-నాళిమ్రోల మోదమలర బలికె.

అంబుధరుని కాంతి, యచ్చోసి, నట్లుండె-గాని యచ్చలోన మచ్చబుట్టె
ననగ వారి కనిమె యచ్చకు మచ్చున్న-చచ్చుగాని యిటకు వచ్చునొక్కొ?

కూతురి మాటవిన్న జనకుండు ప్రమోదమునంది వెంటనే
పూతచరిత్రుడైన ప్రభు-పుంగవ జోయె మణీపురంబునన్
నాతడు సత్కరించి, తమ యాగమనంబున కారణంబెదో
చేతము సంతసింపగ వచింపు డటంచును పల్కినంతనే.

పావన సాళ్వదేశమును పాలన జేసెడు వాడనాకటన్
దైవమనుగ్రహించెను ప్రధానములైన విన్నాల్గుభూములన్
భూవర యందు మూడు తమ పుణ్యవశంబున సాగునొందగా
నే విభవంబు నొందకయె హీనత నాల్గవభూమి కేర్పడెన్.

పాలనగల్గువేళ వృషభంబు హఠాత్తుగ నడ్డురాగ యే
యాలనలేకపోయె నిపుడన్యులు చేయున దేమియంచు భూ
పాలుని మంత్రిబల్క విని పార్థివుడాతనితో వచించె మే
ల్కీలు యదార్థముందెలియ లేక వచింపగ న్యాయమానొకో.

పాలన గల్గుచుండె మునుబాగుగ పుణ్యతనొందె నిప్పుడా
యాలన లేకపోవుటకు యడ్డుపడెన్ వృషభేంద్ర మొండు దు
ష్కాల వశంబునంచు బలుకన్ సచివోత్తముతోడ బల్కె భూ
పాలుడు విట్టులాడగను పాడియె? నీవు నిజంబెరుంగకన్.

ధర్మవిరుద్ధతన్ వెలసి ధైర్యమునన్ వృషభేంద్రు డొచ్చెనా
పేర్మిని రూపడంచుటకు వేగమె చెల్లెలిగట్టు నడ్డురా
నిర్మలభావముం గనెను నిక్కముగా వృషభేంద్రముప్పు స
త్కార్మముతో వెలుంగు గానగా తొలిరీతిసమాదరించినన్.

సాధు చరితయైన సాధ్విని సత్వర-బిలువనంపె మంత్రి ప్రేమతోడ
దంత పేటికలను, దండిగా మంజుల-కరణమిచ్చె రాజు యాదరమున.



# స్వయంవరం

శ్రీ గోపరాజు వెంకటానందం

శ్రీమతి గోపరాజు సీతామహాలక్ష్మి

[లలిత సీత, ప్రకాశంగార్ల కుమార్తె. ఆమె వివాహప్రస్తాపన సందర్భమున సీత తన కూతుర్ని ఆరునూరైనా, నూరు ఆరయినా మనోహరానికిచ్చి చెయ్యాలని పట్టుబట్టింది. కాని లలిత, ఆమె తండ్రి, మేనమామ ఆ సంబంధమునకు సుముఖులు. మనోహరం లలిత సహాధ్యాయులు. ఒకరి నొకరు ప్రేమించుకుని వివాహమాడ నిశ్చయించుకున్నారు. కాని లలితతల్లిదండ్రులు వేరే సంబంధం చూస్తున్నారని తెలుసుకొని మితిలేని బాధకు గురియైనాడు మనోహరం. మనోహరంగారి యింట్లో వాళ్లు ప్రకాశంగారి సంబంధము అందుబాటులో నుండదేమోనని యితరత్రా ఎన్ని సంబంధాలనుచూచినా మనోహరం ఏదో ఎన్నిక పెట్టి చిట్లగొడుతున్నాడు — యిక చదువండి.]

(గత సంచిక తరువాయి)

## ౪

సీ:-ఏమండోయి! మీరిప్పుడే ఆఫీసునుంచివచ్చారు-యిప్పుడేవిషయం అడగడం అంత మంచిపనికాదు కాని - ఆమధ్య అమ్మాయికి సంబంధాలు చూస్తున్నామన్నారు. ఏంజేశారు?

ప్ర:-వెదుకుతూనే యున్నాను - నేనుమాత్రం కూర్చున్నానేమిటి! నీమాత్రం శ్రద్ధ నాకూయుంది.

సీ:-మీకు శ్రద్ధలేదనికాదు. నీళ్లాటరేవులలోను, అక్కడా అక్కడ అంతా ఏమనుకుంటున్నారో తెలుసా? "ఈడువచ్చిన పిల్ల. పెళ్లి చేయకుండా పదిమంది మగవాళ్లలోకి తిప్పుతున్నారు. ఆ అమ్మాయికి తెలియకపోతే, పెద్దవాళ్లకేనా తెలియవద్దా" అంటున్నారు. పైగా మనఅమ్మాయి మాత్రం తక్కువదా. మొన్న ఆ మధ్యజరిగిన అదేదో మీటింగులో ఉపన్యాసం కూడా యిచ్చిందిట.

ప్ర:-ఔనౌను. అమ్మాయి ఉపన్యాసాన్ని వాళ్లమనోహరం పెద్ద అక్షరాలతో పత్రికలలోకూడా వేశాడు.

సీ:-(కోపంతో) ఇంతమంది మగవాళ్లుండగా వాళ్లంతా ఊరుకోగా లేనిది అతనే ఎందుకు వ్రాయాలి - పేపర్లో - మనందరినీ యాగీ చేయడానికి కాకపోతే, అందుకే కాబోలు అందరికీ తెలిసింది.

ప్ర:-అదికాదే! ఈ వూళ్లో ఏదైనా పత్రికలకు వ్రాయవలసివస్తే, అతనే వ్రాస్తూయుంటాడు అతను గాక యితరులెవరైనా వ్రాసిపంపితే పత్రికలలో వేసుకోరు.

సీ:-సరేలెండి - ఏమైతే నాకెందుకు, ఇంతకు అమ్మాయికి వెంటనే పెళ్లి చేసితీరాలి, వచ్చే నెలలో మంచి ముహూర్తాలుకూడా యున్నాయి. ఎక్కడైనా మంచి సంబంధం చూడండి. ఇది ఎన్నోసార్లో మీతోచెప్పడం. నోరుపడిపోతోంది.

ప్ర:-అబ్బబ్బ! ఈ మాయదారి సంబంధాల కొరకు-నాతో చెప్పలేక నీవు నోరుపడిపోతూంటే, తిరగలేక నాకు కాళ్లు పడిపోతున్నాయి. చదువుకొన్న పిల్లకూడా అని చెప్పినప్పటికీ, అంతా కట్నాలెంత యిస్తారు-లాంఛనాలు ఏమి జరుపుతారు - అని అడిగేవాళ్లే. మనమేమి యివ్వగలం చెప్పు.

సీ:-(నిట్టూర్పు విడిచి) ఊ! బాగానే యుంది. అయితే అమ్మాయికి పెండ్లికానట్లే. అమ్మాయి చదివిన చదువంతా గంగలో కలిసినట్లే. — మరి, ఇప్పటి కుఱ్ఱవాళ్లంతా కట్నాలు పుచ్చుకోకూడదనీ, చదువుకొన్న పెళ్లాలనే చేసుకోవాలనీ అంటూంటారుగా.

ప్ర:-ఓసి పిచ్చిదానా! నీకేమీ తెలియదు. చదువుకొన్న పిల్లలు కట్నాలతో సహా కావాలని దాని గూఢార్థం. లేకపోతే వంటింట్లో ఉపయోగించే ఒట్టిచదువెందుకే. అల్లా సంపాదించలేని వాడికికూడా కట్నం ఆశే. - ఏమిచేసేది. అసలు ఈ పాడు రోజులలో ఆడపిల్లలను కనడమే తప్పులా కనిపిస్తోంది. - అరిగో, మీ గురుమూర్తి అన్నగారు కూడా సమయానికే వస్తున్నారు. ఈయనేమంటారో చూద్దాం.

గురుమూర్తి:-బావగారూ! ఏమిటి విశేషాలు. తీరుబడిగా కూర్చున్నారే.

ప్ర:-తీరుబడిగా కాదు-మతులు పోయి కూర్చున్నాం.

గు: ఏం! అంతమతులు పోవలసిన విషయమేమి వచ్చింది. ఎక్కడనుండీ ఏమీ అశుభవార్త రాలేదుగదా!

సీ:-కాదు అన్నయ్యా! లలిత పెండ్లి విషయం. ఎక్కడకు తిరిగినా, అంతా కట్నాలు ఎంత యిస్తారని అడిగేవారేట. నీ వెక్కడైనా మంచి సంబంధం చూద్దూ.

గు:-ఇదా! ఇప్పుడింతకీ లలితకు పెండ్లి తొందరేమి వచ్చింది.

సీ: ఆలా అనకు-అంతా ఏమంటున్నారో ఎరుగుదువా! మగవాళ్లకు మీకేమి తెలుస్తుంది. ప్రొద్దున్న వెడ్తారు - రాత్రివస్తారు యింటికి. మొన్న అమ్మ కూడా గట్టిగా చెప్పింది - వెంటనే వివాహం చేయడం మంచిదని.

ప్ర:-ఏమండోయి బావగారు! ఇంతవరకు మంచో చెడ్డో మా అమ్మాయిని పెంచి పెద్ద జేశారు. మీ కన్నకూతురుకంటె ఎక్కువగా చూశారు. ఏదో ఈ మూడు ముడులుకూడా వేయించే బాధ్యత మీపైననే పెట్టాం. మీయిష్టం వచ్చినట్లు చేయండి.

గు:-బాగానేయుంది. చదువంటే ఏదో నాశక్తికొలది చెప్పించగల్గాను. కాని పెళ్లికూడా నేను ఎక్కడ మీద పెట్టుకోను! మొన్న ఆమధ్య భగవంతం గారు వచ్చి అడిగినప్పటికీ నేనేమీ చెప్పక, "నాకు తెలియదు. ఆ అమ్మాయి తల్లి దండ్రుల నడగండి" అన్నాను. మన మెన్ని చూసినా యింతకు పిల్ల అంగీకరించాలి కదా.

సీ:-అలాగంటే ఎలాగన్నయ్యా! ఈడువచ్చిన పిల్ల నలుగురిలోను తిరుగుతూ యుంటే, మేము తలెత్తుకో లేకుండా యున్నాం. — పోనీ, వెలిచేటివారి అబ్బాయి శ్రీరామమూర్తిగారికిస్తే ఎలాగుంటుంది?

గు:-అయినా! రెండో పెండ్లివాడు కదుటే, డబ్బుండగానే సరా! మన పిల్లసుఖం మాత్రం చూడనక్కర్లేదూ!

సీ: ఆయనకేమి అన్నయ్యా! ఎంతో ఆస్థియుంది రెండో పెళ్లని అనుకోవడం తప్ప, ఆయనకు మాత్రం నలభై ఏళ్లేగా యుంటా. అమ్మాయి సుఖపడక ఏమవుతుంది. అమ్మాయితోబాటు మనం కూడా సుఖపడ్తాం.

ప్ర:-ఒక చంటిపిల్లవాడుకూడాను ఆయనకు.

సీ:-బాగానే యుంది. పెళ్లయ్యాక పిల్లలు పుట్టకుండా యుంటారేమిటి. మన అమ్మాయి సుఖానికి

ఆచంటివాడు ఏమైనా అడ్డువస్తాడనా! మీ భయం! ఏమన్నయ్యా, నువ్వేమంటావు.

గు:-నాకు తెలియదే సీతా! మీయిష్టం. నాకు ఆరెండో పెళ్లివాడికివ్వడం ఎంతమాత్రం యిష్టం లేదు. తర్వాత మీరేమనుకొన్నా సరే. మీకభ్యంతరం లేకపోతే వారి మనోహరానికిచ్చి వివాహం చేయండి.

సీ:-మనోహరానికి ఏమి చూసి యివ్వమంటావు అన్నయ్యా. నీవుకూడా అలాగంటావేమిటే.

గు:-అదేమిటేవ్! ఏమిచూశా - యిచ్చేది. మనకళ్ల ఎదుట తిరుగుతున్నాడుకదాయని మీకు చులకనగా కన్పించవచ్చు. అతనిప్పుడు ఎంత సంపాదిస్తున్నాడో తెలుసా. అవతలఖాయమైన ఉద్యోగం, ఇవతల పత్రికలకు యివీఅవీవ్రాసి కొంత సంపాదిస్తున్నాడు. ఎంతలేదన్నా మొత్తం నెలకు 150 రూపాయలకు తక్కువ సంపాదించడం లేదు. ఆమాత్రం మనలో ఎవరు సంపాదిస్తున్నారు చెబుతూ. మనిషిలో మంచిచదువు, విజ్ఞానం, వినయం యున్నాయి. అడవిలో పారవేసినా కొట్టుకురాగలడు; తర్వాత మీయిష్టం.

ప్ర:-నాకేమీ అభ్యంతరం లేదుగాని, మీచెల్లెలికే నోయి నచ్చచెప్పలేకపోతున్నాను.

సీ:-(ఉడికినట్లుగా) మరే. మీరంతా ఔనంటే నేను మాత్రం కాదంటానా ఏమిటి. నామీద పెడ్తారు- అక్కడికి, అన్నీ నేను చెప్పినట్లు చేస్తున్నట్లు, మెత్తని వారిని చూస్తే మొత్తబుద్ధి అన్నట్లు, అందరికీ నేనొకదానిని కనిపిస్తున్నాను. లోకువగా పడడానికి.

గు:-మీరిప్పుడు అంగీకరిస్తే మాత్రం ఆ అబ్బాయి అంగీకరించవద్దూ! మొదట్లో మీచేతవద్దనిపించుకొన్న మనిషి, ఇప్పుడుమళ్ళీ ఒప్పుకుంటాడేమిటి! ఎంతలేదన్నా గౌరవస్థుడు, మగవాడుకదా. నాకు నమ్మకంలేదు అంత సులభంగా అంగీకరిస్తాడని. అతనికికూడా యింతకన్న మంచిసంబంధాలు ఏవో వస్తున్నాయనికూడా విన్నాను.

ప్ర:-అలాగుకాదు బావగారూ. మీరు మనస్ఫూర్తిగా పూనుకొంటే తప్పక అంగీకరిస్తాడని మాకు ధైర్యముంది. మీరు నడుంకట్టుకోవాలి కొంచెం. పెరటి చెట్టు మందుకు రాదన్నట్టు కళ్లఎదుటనున్నవానిని గ్రహించలేకపోయాం.

సీ:-(తనలో) వెర్రి పీనుగుని పండంటి కుర్రవానిని విడిచి పెట్టి, యిక్కడకు అక్కడకు తిరిగాం తెలియక. ఆస్థులున్న వాళ్లుమాత్రం తర్వాత పాడుచేసుకొన్నవాళ్లెంతమంది లేరు! దూరాన్నున్న వాళ్లకేమి దుర్గుణాలున్నాయో మనం చూడ వచ్చామా! దూరపు కొండలు నునుపు అన్నట్లు, చిన్నప్పటినుండీ చూస్తున్న కుర్రవానిని విడిచిపెట్టి, ఎక్కడో కొండమీద కూర్చున్న వాళ్లకోసం ఉరుకులెత్తాం - తెలియక. (పైకి) అన్నయ్యా, అమ్మతోకూడా ఈ విషయంచెప్పి, ఆయనగారన్నట్లు, నీవు గట్టిగా నడుంకట్టుకోవాలి.

గు:-సరేలే నా శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తాను. కాని ప్రయోజనముంటుందని నాకు నమ్మకంలేదు. మరి వెళ్లివస్తాను. మీరుకూడా లేచి భోజనాలు చేయండి.

(తెరపడును)

[లలిత మనోహరం యిద్దరూకలసి ఒక నాటి ఉదయం కాకినాడలో]

లలిత:-మీరు మొత్తంమీద పెండ్లికొడుకు మస్తాబేయి వచ్చారు.

మనోహరం:-పెండ్లికొడుకును కాదామరి.

ల:-ఔనులెండి.

మనో.-(ఆశ్చర్యంతో) లలితా! ఇంతవరకు నన్ను "నీవు నీవంటూ," కాకినాడలో కాలుపెట్టినప్పటినుండి "మీరు" అని మన్నిస్తున్నావేమిటి.

ల:- ఓహో ! పెద్ద సందేహమే వచ్చింది. చెప్పమంటారా - ఏమిటి. ఇన్నాళ్లూ మనం ప్రాణస్నేహితులవంటివారమే. కాని కొద్ది సేపట్లో మన మిరువురం ప్రాణేశ్వరుల మవబోతున్నాము. మీరింతవరకు నాకు మంచి సలహాలిచ్చి నా జీవితాన్ని మంచిదారిలో నడపడానికి తోడ్పడిన ఒక ప్రాణమిత్రులు. కాని యిప్పటినుండి మీ సలహాలతోబాటు మీ జీవితాన్నే నాకు సమర్పించిన ప్రాణదాతలు. అట్టి మిమ్ము్మలను ఈ క్షణంనుండి గౌరవించడం నావిధి. అలా మిమ్ము్మలను గౌరవించడంకూడా నా గౌరవాన్ని నేను మరింత అధికం చేసుకోవడమే అవుతుంది.

మనో:- ఓహో ! గొప్ప వేదాంతమే బోధించావు. మరి, నీవు నన్ను పెండ్లాడడం మీ వారెవరికీ యిష్టంలేదుగదా ! తర్వాత నీవు మీ వాళ్లకు దూరమవుతావేమోనని నేను బాధ పడ్తున్నాను.

ల:- పోనీలెండి ! నాకు పెండ్లి తర్వాత కావలసింది మీరుగాని, వాళ్లుగాదు. మనమిద్దరంకూడా స్వతంత్ర జీవులం. ఇతరులపై ఆధారపడనక్కర లేదు. ఇద్దరంకూడా వయస్సువచ్చిన వారమవడం చేత, పెళ్లంటే ఏమిటో బాగా అర్థంచేసుకొని, స్వయంగా ఒకరి నొకరం వరించుకొని వివాహం చేసుకొంటున్నాము. దీనికి మావారుగాని యితరులుగాని ఓర్వలేక ఏమైనా చేయదలబెట్టారా. దాని ప్రతిఫలం వారే అనుభవిస్తారు.

మనో:- అయితే చాలా ధైర్యంతోనే యున్నావన్నమాట. లోలోపల భయపడ్తూ, బాధపడ్తున్న నాకుకూడా నీ మాటలు మంచి ధైర్యాన్ని యిచ్చాయి. నీ వంటి సహధర్మచారిణి దొరికినందుకు నన్ను నేనే అభినందించుకుంటున్నాను.

ల:- ఏమండీ ! మన వివాహమైపోయిన తర్వాత యిక్కడనుండే మనవాళ్లకు ఆ సంగతి తెలియబరిస్తే బాగుంటుందేమో. మా నాన్నగారి డ్రాయరుమీదపెట్టిన నా ఉత్తరం చూచుకొని, అసలీ పాటికే నానాగందరగోళం పడ్తూ యుంటారు.

మనో:- ఒక పని చేద్దాం. రాత్రి ఏడున్నర గంటల బండికి పెళ్ళిచేసుకొని అక్కడకు చేరుకుంటున్నాము కాబట్టి గ్రామంలోని మిత్రులనందరినీ ఆహ్వానించి, విందు ఏర్పాటుచేయమని మీ వాళ్లకు, మా వాళ్లకుకూడా టెలిగ్రామిద్దాం.

ల:- (నవ్వుతూ) సరేగాని - వాళ్లు మనపై కోపం కొలదీ విందు ఏర్పాటుచేయకపోతేనో !

మనో:- పోనీలే అందువల్ల మనకు వచ్చేనష్టమేమిటి ? విందు ఏర్పాటు చేశారా - అందరికీ గౌరవం దక్కుతుంది. మన పెండ్లిని అంతా ఆమోదించి హర్షించినట్లుకూడా - ఆ విందు ఏర్పాటువల్ల మనం గ్రహించుకోవచ్చు. లేదూ - మనం మొదట్లో అనుకున్నట్లే అవుతుంది. కాని ప్రత్యేకంగావచ్చి మీదపడే నష్టమేమీ లేదు.

ల:- నష్టమంటున్నారు ! పెళ్ళిళ్ళకువచ్చి విందులు ఆరగించేవారంతా ఆ వివాహాలు ఆమోదించాలా ఏమిటి ? ఈ పెద్దలకు నచ్చకపోయినందువల్ల వచ్చేనష్టంకూడా ఒకటుందా ?

మనో:- ఆ ! లేదుమరీ ! సంఘాన్నెదిర్చి సంఘకట్టుబాట్లకు విరుద్ధంగా మనం పెళ్ళిచేసుకొన్నందుకు మనపై సంఘం అనేక అభాండాలువిసిరి నవ్వుతూ యుంటుంది.

ల:- మనం చేస్తూన్నపని ఏమీతప్పుకాదుగా ! సంఘసంస్కారులంతా, సభలు, సమావేశాలుజరిపి వధూవరు లొకరి నొకరు ప్రేమతో వరించుకొని వివాహాలు చేసుకోవాలని అంటూంటారే, మరి, ఆ సభలకు చాలమందివచ్చి తలకాయలు ఆడిస్తూనే యుంటారుకూడా ! అంటే వారంతా వాటిని అంగీకరించినట్లేకదూ !

మనో:- కాదు కాదు. - సభలలో సంఘ సంస్కారాన్ని గురించి అలా కొందరు ఆరిందాలు లెక్చర్లు కొడ్తూండడం, సభికులంతాజేరి, తలలూపడం, - అది ఒక సభ్యతా లక్షణం. ఆధునిక సంస్కృతికి

అదొక చిహ్నం. సంఘంలో గౌరవ, మర్యాదలు సంపాదించడానికి అదొక మార్గం. అంతే గాని వారు తలలూపుతూ అంగీకరించి చేసిన తీర్మానాలు, గుండెలు బాదుకుంటూ, రొమ్ము విరుచుకొని చేసిన ఆ ఉపన్యాసాలు, ఆచరణలో పెట్టమని కాదు.

ల:- ఆచరణలో పెట్టడానికి కాకపోతే, మరెందుకు ?

మనో:- అమ్మ బాబోయి! వాళ్లు చెప్పినట్లు ఎవరైనా స్వతంత్రించి స్వయంవరం చాటినా, ప్రేమించి పెండ్లిచేసుకొన్నా, వారు సంఘ దృష్టిలో పరమ దుర్మార్గులు. నీతి నియమాలు, భయభక్తులు, గౌరవ మర్యాదలు లేని కామాంధులు. అంతవరకు ఎందుకు - రేపటినుండి మనల నిద్దరినీ ఎలా దుయ్యబడ్తుందో ఈ సంఘం - నీవే చూస్తావుగా.

ల:- పెళ్ళిచేసుకొని ప్రేమించడంకంటె, ప్రేమించి పెళ్ళిచేసుకోవడంలోనే ఉత్కృష్టత యుందంటూంటారు నేటి కవులంతా.

మనో:- ఔను. అలాగనే అంటారని నేను మాత్రం చెప్పలేదూమరి! ఈలాంటి పదజాలంతో వారి కవిత్వానికి నూతనాలంకారాలుదిద్ది భావవీధులలో అందరినీ త్రిప్పుతూంటారు. అంతవరకే ఆ కవిత్వం. తీరా రంగానికురికితే, సంఘానికి దూరమవుతామన్న భయం వీరికీ యుంది.

ల:- సంఘమంటూంటారు. సంఘమంటే ?

మనో:- (నవ్వుతూ) సంఘమంటేనా - దానికి అధ్యక్ష కార్యదర్శులంటూ ఎవరూ లేరు. నామరూపాలంటేకన్నా లేవు. ఈ సంఘంలో చేరడానికి మాసవారీచందాకూడా చెల్లించనక్కరలేదు. మనం కళ్లతో చూస్తున్న మనుష్యులందరూ సంఘ సభ్యులే. వీరిలో ఏ ఒక్క ఘరానా మనిషిని ఎదిర్చి నిలచినా, సంఘాన్నంతను ధిక్కరించినట్లే, నీవు చూశావన్న ఆ మీటింగులో తలలూపే వ్యక్తులందరుకూడా ఈ సంఘ సభ్యులే. కాని వారంతా మనల్ని వెనుకవేసుకొని వస్తారనుకోకు. మిగిలిన వారితోబాటు వీరంతాకూడా తలొక రాయివేస్తూ - "సంఘానికి వెరవాలా-అక్కర లేదా" అని నిలదీసి ప్రశ్నించడం సంఘ మర్యాద. తెలిసిందా!

ల:- ఏమోనండి. నేనంగీకరించను - మీవాదనతో. మనం మన హృదయాలువిప్పి, వారి కందరికీ నచ్చజెప్పడంలోయుంది. అసలింతవరకు ఆ విధంగా ఆచరించి, నచ్చజెప్పినవారేరీ !

మనో:- లలితా - నీ వెంతటి వెర్రిదానవు. నీ మాటలు, నీ మొరలు వినడానికి ఎవరికి ఓపికయుందీ సంఘంలో. - ఎవరికని, ఎంతమందికని చెబుతావు? లోకం గ్రుడ్డిది. నీవు చెప్పినవన్నీ ఈ సంఘం చెవులతో చూచి, కళ్ళతో వింటుంది. సంఘానికి నీవు నచ్చచెప్పడానికి మరో వేయి జన్మాలెత్తవలసి వస్తుంది. నీ నిజానిజాలు - నీ హృదయపరివర్తనం - నీ సంఘ సంస్కారం, యివేమీ సంఘానికి అవసరంలేదు. సంఘానికి కావలసిందల్లా, సంఘపురాతన కట్టుబాట్లను ఎదిర్చి నిల్చినవారిని, ఏదో ఒక వంకపై అపతలకు నెట్టి, నవ్వుతూ చూస్తూండడమే. పైగా సంఘంలో ఒక వ్యక్తికి జరిగిన ఈ ప్రాయశ్చిత్తము అతనితోనే పోనివ్వక, అతని వంశ పారంపర్యా ఆ దోషం అంటగడ్తూనే యుంటారు.

ల:- అయితే, ఇప్పుడీ సంఘంలో మనలా వివాహాలు చేసుకొనే వారెంతమంది వుంటారు?

మనో:- బహుకొద్దిమంది. ఇప్పుడు వివాహాల రిజిస్ట్రేషను ఆఫీసుకు వెడ్తున్నాంకదా ! అక్కడ అడిగితే, యిప్పటికి మొత్తం ఎన్ని వివాహాలు జరిగినవీ ఆ రిజిస్ట్రారుగారే చెబుతారు.

ల:- త్వరగా పదండి తెలుసుకుందాం. మనం చేస్తున్న పని, మన యిరువురి హృదయాలకు సత్యమని తెలిసినప్పుడు, ప్రభుత్వంకూడాఈ పద్ధతి న్యాయమని అంగీకరించినప్పుడు యిందులో తప్పేమీ లేదని నా అభిప్రాయం. అవసరమైతే సంఘాన్నెదిర్చి, నిర్భయంగా నిలుద్దాం.

మనో:- అయితే పద - ముందుకు.

(ఇద్దరు వెళ్ళిపోవుదురు)

( తెరపడును)



# స్వదేశీ వస్తువులను భారత మహిళలు ప్రోత్సహించాలి

**అఖిలభారత హిందూ మహిళా సభలో శ్రీమతి సరస్వతీబాయ్ కవనేకర్ ఉద్బోధ**

13 వ అఖిల భారత హిందూ మహిళాసభ అధ్యక్షోపన్యాసంలో శ్రీమతి సరస్వతీబాయ్ కవనేకర్ ఉద్ఘాటించారు.

స్వదేశీవస్తువులనే భారత మహిళలు కొనాలనీ, అత్యవసరాలకే సొమ్మును వ్యయంచెయ్యాలనీ భారత మహిళలకు విజ్ఞప్తిచేశారు. బీద, మధ్య తరగతి ప్రజల సౌకర్యార్థం ఉచిత మొబైల్ ఆసుపత్రులు, వైద్యశాలలు తెరవాలనీ శ్రీమతి కవనేకర్ అభ్యర్థించారు.

స్త్రీవిద్యను గురించి ప్రస్తావిస్తూ సుఖవంతమైన, ఆరోగ్యకరమైన జీవితాన్ని గడపటానికీ, తమ బిడ్డలకు విద్యను గరపటానికి స్త్రీలకు విద్య ముఖ్యంగా ఉపకరించాలన్నారు. ముందుతరాలకు మాతృదేవతయే కారణమనీ, అందువల్ల, నవీనఅవసరాలకు, సంస్కృతి, సాంప్రదాయాలకూ అనుగుణ్యంగా ఉత్తమ విద్య స్త్రీలకు అవసరమనీ, చవకలో అందరికి లభ్యం కావాలనీ పేర్కొన్నారు. ప్రాథమిక విద్య ఉచితంగా ఇవ్వబడాలనీ, పొదుపు నేర్చుకొని, కుటీర పరిశ్రమలను అభ్యసిస్తే స్త్రీలు ఆర్థికఇబ్బందులను సర్దుకోగలుగుతున్నారు అనికూడా చెప్పారు.

# ఒంగోలు హైస్కూలు బాలానంద సంఘం

## ద్వితీయ వార్షికోత్సవం

ఒంగోలు, మే 5 స్థానిక మున్సిపల్ హైస్కూలు బాలానందసంఘం ద్వితీయ వార్షికోత్సవం ఆదివారం సాయంత్రం శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవిగారి అధ్యక్షతన జరిగింది.

శ్రీమతి ఇందుమతీ దేవిగారు "బాలబాలికలకు నిరుపద్రవమైన ఉత్సాహము, ఉద్రేకము కావాలి; వారికి మంచి పద్ధతులు నేర్పాలి, చక్కని పాటలు కథలు ఆటలు నేర్పాలి" అని సలహా యిచ్చారు.

పురుషులతోపాటు స్త్రీలకు సమాన హక్కులుండాలనే విషయం ప్రస్తావిస్తూ శ్రీమతి ఇందుమతీ దేవిగారు యిలా అన్నారు– "భగవంతుని పక్షపాతమో, సృష్టి వైపరీత్యమో తెలియదు. స్త్రీ సుకుమారి, రక్షణీయ; ఇంట్లోనే ఉండి సుకరమైన పనులు చేసుకొనడానికి నిర్మాణమైనది. విద్యలు నేర్చుకోవచ్చు. అవసరానికి ఉపయోగించుకోవచ్చు. ప్రతిదానికి పురుషులతో సమానంగా పోతామని అనకూడదు. స్త్రీది మాతృస్థానం. అది పవిత్రంగా ఉంటే దేశం పవిత్రంగా ఉంటుంది."

తర్వాత శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు ఉపన్యసిస్తూ, "రేడియోలో ప్రసారమవుతున్న పిల్లల కార్యక్రమాన్ని పాఠశాలలు విని యోగించుకొనుటలేదు. విజ్ఞానం వినోదం పిల్లలకు అబ్బాలి. ప్రతి పాఠశాలలోనూ బాలానంద సంఘాలు ఏర్పడాలి. పిల్లలకు స్కూలు వేళలలో మార్పు ఉండాలి. ఉదయం తరగతులు పెట్టి మధ్యాహ్నం కళలు బోధించు తరగతులు ఏర్పాటు చేయాలి," అని అన్నారు.




# అత్తకోడండ్ర కీచులాట

అత్త, కోడండ్ర పేచీలు యీనాడు, ఆనాడు అనే విచక్షణ లేకుండా యుంటున్న వనడానికి పురాణాలలోని కొన్ని కథలే ఆధారములు. బాలలూ! యీ చిన్నకథను చూడండి!

సకలసంపదలకు అధిపతి లక్ష్మి. ఆమె సకల విద్యలకు అధిపతి సరస్వతికి అత్త. వీళ్లద్దరు ఒకరోజు తాను గొప్పంటే తాను గొప్పఅని రెట్టించుకొని తమవ్యక్తిగత సామర్థ్య ప్రదర్శనకు పూనుకొన్నారు.

లక్ష్మి ఒక బీద జాలరికి ప్రసన్నమయింది. వాడు పట్టిన ఒక చేపకడుపులో నొక అమూల్యమైన మణిదొరికింది. దానిని అమ్మూటవలన లక్షలకొలది ధనం సమకూరి ధనకనకవస్తువాహనాలతో తులతూగి పోతున్నాడు.

సరస్వతీ దేవికటాక్షమునకు ఒకరాజు కుమార్తె పాత్రమైంది. దానిమూలంగా సంగీత సాహిత్యాలతో అపరచదువుల దేవతగా నొప్పించినది. తండ్రి ఆమెకు వివాహప్రయత్నాలు ప్రారంభించాడు. అల్లుడు సంపన్నుడైతె కుమార్తె సుఖపడాలనే ఆశతో సకలసంపదలతో తులతూగుతున్న జాలరికిచ్చి అత్యంత వైభవంగా వివాహం చేశాడు.

భార్యా భర్తల నిద్దరిని ఏకాంత గృహంలోకి ప్రవేశపెట్టారు. జాలరికి సకల సంపదలైతే యున్నవికాని అక్షరజ్ఞానం లేదాయ! మొద్దులాగపండుకొని నిద్రపోవసాగాడు. రాజకుమారికి తనభర్త పలుకరించనైనా లేదేయని తన సంగీత ప్రావీణ్యముతోనైనా, అనుగ్రహపూరితుడగుతాడని వీణవాయించడం మొదలుపెట్టింది; అత్తరు పన్నీరులను చల్లింది–కాని మొద్దునిద్రనుండి లేచాడు కాడు. ఆమెకు అనుమానమేసి – ఆ విద్య, విజ్ఞాన శూన్యునితో జీవయాత్ర ఆసాంతంవరకు సాగించేదానికంటె ఆత్మహత్యచేసికొనడం మేలని ఉరిబోసుకోడాని కుపక్రమించింది.

దేవలోకంనుండి యిదంతా చూస్తున్న సరస్వతీదేవి, అత్త లక్ష్మీదేవితో "రాజ

కుమారి ఉరిపోసుకొని చావబోతున్నది; ఎలాగైనా రక్షించాలి'' అన్నది.

''అదేమోనమ్మా! నా కలివయ్యేపని గాదు'' అన్నది లక్ష్మీదేవి.

అప్పుడు సరస్వతీదేవి నిద్రావస్థలో నున్న జాలరికి ప్రసన్నురాలై విద్యాపాండిత్యాలను ప్రసాదించి తట్టిలేపింది. జాలరి లేచి ఉరిత్రాళ్లు త్రెంచి పారవేసి రాజకుమారి ప్రాణాలు కాపాడి-ఆలు, మగడు చిలుకాగోరంకుల్లాగ జీవయాత్ర ప్రారంభించారు.

చూచారా బాలలూ! అత్తకోడండ్రు వ్యక్తిగతంగా నెంత సమర్థులైనా, తెలివితేటలుకలవారైనా, పరస్పరసహకార, సద్భావాలతోనే కాని కుటుంబంలో ఆనంద సౌభాగ్యాలు పెంపొందవు. వానినే మీరు అలవరచుకోవాలి!

చివుకుల లక్ష్మీపున్నయ్య

---

# జైమినీ భారతం

కవులను, పండితులను పోషించిన రాజులలో నరసింహరాయలొకడు. అతని ఆస్థానములో పినవీరభద్రుడు గొప్పకవి. ఆ రోజుల్లో అతనికతడే సాటిఅని చెప్పాల్సివుంటుంది.

ఒకనాడు నరసింహరాయలు నిండు సభలో వీరభద్రునితో ''కవీంద్రా! మీపూర్వులు అనేక గ్రంథములు రచించి నాకంకిత మిచ్చి కీర్తిగడించిరి. మీరు కూడా ఒక గ్రంథమురచించి నాకంకితమివ్వ'' అని తాంబూలమిచ్చెను. పినవీరభద్రకవి 'సరే' నంటూ నెలరోజుల గడువుతో యిల్లుచేరెను.

రోజులూ, వారములూ గడుస్తున్నవి. కాని వీరభద్రుడు గ్రంథమురచించుటకు ఏప్రయత్నమూ చేయనే లేదు; వీరభద్రుని అన్న తమ్మునికెన్నిసార్లో జ్ఞాపకము చేసి మందలించేవాడు. ఏదో సాకు చెప్పి తప్పుకొనేవాడు ఎందుచేతో వీరభద్రుడు.

నెలరోజుల గడువుపూర్తి అయింది. మర్నాడు గ్రంథము రాజు కంకితమివ్వాలి! అన్న పెదవీరభద్రుడు. ''వ్రాసితివా?''అని అడగ్గా, ఇదో! ఈరాత్రి తప్పక మొదలుపెట్టి ఉదయమునకల్లా పూర్తిచేస్తా'' నని చెప్పేడు.

పినవీరభద్రకవి భోజనమయిన తర్వాత పడకగదిలో ప్రవేశించేడు. గ్రంథం మొదలుపెట్టాలనుకున్నాడు. కాని నిద్రాదేవత అతన్ని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది.

'ఎంతగొప్పకవి అయినా ఒక్కరాత్రిలో గ్రంథం పూర్తిచేయగలడా!' అనే సందేహంకలిగింది పెదవీరభద్రునికి. తమ్మునకు రాజుచే పరాభవం జరుగుతుందనే భీతితో ఆరాత్రంతా నిద్రపట్టనేలేదు.

రెండవజాములో వ్రాస్తున్నాడో లేదో అని సందేహంకలిగింది. మెల్లగాలేచి తమ్ముని పడకగదియొక్క తలుపు నెట్టేడు. వళ్లుకంపించింది. 'ఆఁ...ఎవరో స్త్రీ అతని ప్రక్కనకూర్చొని గంటంతో ఏదో వ్రాస్తున్నది. అతను మాత్రం గురకలు పెట్టి నిద్రపోతూన్నాడు. ఆస్త్రీయొక్క తలమీద కిరీటముంది. ఆమెముందు ఒక వీణ...ఇంకెవరు''సరస్వతీదేవి!''. పెదవీరభద్రునికి ఆశ్చర్యంవేసింది.

సరస్వతీదేవి పెదవీరభద్రుడు రావడంచూచి మండిపడ్డది. తనకోపమాపుకోలేక తనచేతిలోవున్న గంటం విసిరేసి మాయమయింది. ఆమెవిసిరిన గంటం వీరభద్రుని కంటికి తగిలింది.

మర్నాడు పినవీరభద్రుడు అన్నద్వారా రాత్రి జరిగినసంగతంతా విన్నాడు. అన్నదమ్ములు చాలా పశ్చాత్తాపపడ్డారు. ఇంక ఏమనుకున్నా ఏంలాభం?

పినవీరభద్రకవి అసంపూర్తిగ్రంథమునే రాజుకి అంకితముచేశాడు. అదే 'జైమినీ భారతం' అని అంటారు.

చికాకుల భూపతిరావు.

# కర్మదేవి

రాజపుత్రస్థానంలోని ఔరంత రాజ్యాన్ని మాణిక్యరాజును పరిపాలిస్తూ వుండేవాడు. మాణిక్యరాజు లేక లేక కలిగిన కుమార్తె కర్మదేవి. కర్మదేవి తెలివయినది, ధైర్యపరాక్రమాలు గలది.

పూగల్ సంస్థానాధిపతియైన రణవంగదేవుని కుమారుడు సాధుకుమారుడు. సాధుకుమారుడు గొప్ప ధైర్య పరాక్రమాలుగలవాడు. సాధుకుమారుడికి, మాణిక్యరాజుకి మధ్య మంచి స్నేహంవుంది. అంచేతనే సాధుకుమారుడు అప్పుడప్పుడు, ఔరంత రాజ్యానికి వస్తూపోతూ వుండేవాడు. ఇలా సాధుకుమారుడు వస్తూండడంమూలాన కర్మదేవి, సాధుకుమారులమధ్య ప్రేమ అభివృద్ధిగాంచింది. కాని యీ సంగతి మాణిక్యరాజుకి తెలీదు.

కర్మదేవికి యుక్తవయస్సు వచ్చింది. మాణిక్యరాజు వివాహప్రయత్నాలు ప్రారంభించాడు. దేశదేశాలనుండి ఎన్నెన్నో చిత్రపటాలు తెప్పించాడు కాని కర్మదేవి కవేవి నచ్చలేదు.

చివరికి మాణిక్యరాజే మందర సంస్థానాధిపతియైన రామచంద్రుని కుమారుడు అరణ్యకమలుడికివ్వ నిశ్చయించాడు. అరణ్యకమలుడు మంచి ధైర్యం, పరాక్రమంగలవాడు; సుగుణవంతుడు. అయినా కోపిష్ఠి.

కర్మదేవికీసంగతి తెలియగానే చాలా దుఃఖించింది. వివాహప్రయత్నాలు జోరుగా జరుగుతున్నాయి.

కర్మదేవి సంగతి చెలికత్తెలు తెలుసుకొని మాణిక్యరాజుకు చెప్పారు.

మాణిక్యరాజు కర్మదేవి పెళ్ళికి ఒప్పుకోలేదని తెలియగానే చాలా గాభరాపడ్డాడు.

"అమ్మా! ముందు చెప్పివుంటే, ఆ సాధుకుమారుణ్ణే రప్పించేవాణ్ణిగా! - ఇప్పుడెలాగ? అరణ్యకమలుడికి మాట యిచ్చానే ...! ..." అంటూ బాధ పడ్డాడు.

"ఏమయినా యీ వివాహం జరగడానికి వీల్లేదు నాన్నగారూ!" అంది కర్మదేవి.

"అలా అంటే ఎలా చెప్పు! పెళ్లి సన్నాహాలన్నీ అయిపోయినా యమ్మా!"

"నాన్నగారూ! నేను ఇంతకుముందే నా హృదయంలో సాధుకుమారునికి స్థానమిచ్చాను! - నాకు రెండు నాలుకలు, రెండు హృదయాలు లేవు! - పెళ్లిసన్నాహాలు జరుగుతూంటే, వాటితోపాటు మరణం సన్నాహాలుకూడా జరుగుతున్నాయి!"

మాణిక్యరాజు ఒక్కగా నొక్క కుమార్తెగావడం మూలాన అరణ్యకమలుడి కీసంగతి వ్రాసి, సాధుకుమారుని నిశ్చయించాననికూడా వ్రాశాడు.

ఈ ఉత్తరం చూడగానే అరణ్యకమలుడికి ఎక్కడలేని కోపం వచ్చింది -! అసలే దూర్వాసుడు ...! అరణ్యకమలుడు సాధుకుమారుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేసి, యుద్ధసన్నాహాలు చేయసాగాడు.

సాధుకుమారుడికి, కర్మదేవికి మహావైభవంగా వివాహం జరిగింది. వారిద్దరూ తమ బలగంతో తమ రాజ్యానికి పయనమయ్యారు.

త్రోవలో అరణ్యాకమలుడు వీరి నడ్డాడు. ఇరు పక్షాలకు ఘోరంగా యుద్ధం జరిగింది. కర్మదేవి కూడా భర్తతో సమానంగా యుద్ధం సాగించింది. కాని దొంగచాటుగా సాధుకుమారుని, అరణ్యాకమలుని సైన్యం చంపేసింది. సాధుకుమారుడు వీరస్వర్గం చేరుకున్నాడు.

కర్మదేవి తన ఎడమచేతిని నరికి మామగారికిమ్మని భటునకిచ్చి "మీ కుమారునితో హాయిగావుండ"నిచెప్పమంది. కుడిచేయిని నరికించుకొని తండ్రికిమ్మని "అల్లుడితో సుఖంగావున్నా" నని చెప్పమని దానిని భటునకిచ్చింది.

తర్వాత కర్మదేవి భర్తతోపాటు మరణించింది.

నేటికీ కర్మదేవిగాథ చరిత్రలో సువర్ణాక్షరాల్తో చెక్కబడివుంది.

పిల్లా సుబ్బారావుశాస్త్రి



# విడాకులు

—— (o) ——

విడాకులకు అనుకూల ప్రతికూలవాద
నలు చాలకాలమునుండియున్నవి. ప్రత్యేక
వివాహాల బిల్లులో యువతీయువకులకు
పరస్పరాంగీకారముతో విడాకుల కవకాశ
మివ్వబడింది. ఈ యవకాశము సద్విని
యోగంకావడం యువతీ యువకులలోని
సదుద్దేశాలు, సద్భావము మీద నాధార
పడి యుంటుంది.

విడాకులు కోరడానికి, పొందడానికి
రెండురకాల కారణాలుంటవి. ఒకటి అవస
రము, రెండవది మోజుననుసరించీను.

భార్యాభర్తలలో నొకరు కురూపిగానో,
వ్యాధిగ్రస్తులుగనో, దురలవాట్లకు
లోనైయ్యో విడాకులు కోరడం, పొందడం
అవసరం అనిపించుకొంటుంది. డబ్బుకో,
పదవికో, తాత్కాలిక సుఖానికో ఆశించి
వివాహమాడి మోజుతీరగానే విడాకుల
కొరకు ప్రాకులాడటం స్వార్థపరత్వాన్ని
సూచిస్తుంది. మోజుకొద్దీ వ్యవహరించే
యువతీయువకుల స్వార్థపరత్వము సంఘ
ములు నైతిక స్థాయిని దిగజారచేయగల
దని గంటాపథంగా చెప్పవచ్చును.

పరస్పరాంగీకారముతో విడాకులను
కోరడం, పొందడం ఏమాత్రం సరసంగా
నమలు జరుగుతుందో ఆలోచించవలసిన
విషయము. భార్యాభర్తల నడతలోనో
లేక యింకేదైనా సహించరాని కారణ
ములవలననో వారిరువురిలో నెవరు విడా
కులుకోరి పొందినా సమంజసమనిపించు
కుంటుంది. లేదా అత్యవసరపరిస్థితులలో
పరస్పర సానుభూతితో విడాకులను పొంద
డము సమర్థనీయమేయనవచ్చును. అలా
కాకుండా దురుద్దేశాలతో యువతీయువకులు
అవకాశవాదులయి మోజుతో విడాకులు
కోరి పొందితే పవిత్ర కుటుంబ జీవితము
భగ్నమగుతుంది. భార్యాభర్తల లోని
లోపాలు ఒకరిపై నొకరి జీవితముపై గల
ప్రభావముతో సరిదిద్దుకోబడి తమకుటుంబ
జీవితాన్ని ఆదర్శవంతంగా చేసికోవాలి.
సమానహక్కులతో బాటు బాధ్యతలను
కూడ స్త్రీలు పంచుకొని యువతీయువ
కులు పరస్పర సహకార సద్భావప్రేమాను
రాగములతో జీవయాత్ర సాగించాలి.

ఈ ప్రత్యేక వివాహాలు యువతీయువ
కులకు యుక్తవయస్సు 21 సం. ముల
లోపున జరిగేవి. పైగా తల్లిదండ్రుల ఆమో
దంతో జరిగేవికూడాను. కాబట్టి యువతీ
యువకులు మంచిచెడ్డలను తెలిసికోగల
స్థితిలో వివాహం చేసికొనికూడా కొంత
కాలమునకు సంతానముకలిగినతరువాత
విడాకులను పొందడం బాధ్యతారహిత
మనిపించుకొనికలిగేవి విషమపరిణామాలు
కాగలవు. సంతానపోషణ, ఆస్తిపాస్తుల
సంక్రమణలాంటివి గడ్డుసమస్యలయి కుటుం
బజీవితాన్నే విచ్ఛిన్నము చేయగలవు.

271 పేజీ చూడుడు.




**శ్రీరామకృష్ణలీలా సంకీర్తనము : శ్రీ అనుభవానందస్వాములవారు. ప్రకాశకులు : శ్రీ అనుభవానంద గ్రంథమాల, భీమునిపట్టణము, బ్రాంచి-బాపట్ల వెల 0-10-0.**

భగవన్నామ స్మరణ, సంకీర్తన రెండూ ప్రజలకు అవసరములే. అట్టి దాని నుద్దేశించియే శ్రీ స్వామీజీ భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జీవిత విశేషాలను, మహోపదేశాలను యీ గ్రంథమునూలంగా కీర్తించి ముఖ్యంగా ఆంధ్రప్రజానీకానికి మహోపకారంచేశారు. ఇది మూడవ ముద్రణయగుటచే యిందలి కీర్తనలు బహుళ జనాదరణీయమైనదని ప్రత్యేకముగా చెప్ప నవసరము లేదు.

ఇందులో నూతనంగా కొన్ని కీర్తనలు చేర్చబడినవి. వానితోబాటు శ్రీ శారదాదేవియున్నతికి కారణమును వివరించు శ్రీ శారదా సందేశముకూడ పొందు పరచబడినది.

**బ్రహ్మధర్మముయొక్క మతము, విశ్వాసము - అనువాదకులు : శ్రీ పాలపర్తి నరసింహం, ధర్మసాధని పత్రికా కార్యాలయం, గుంటూరు. వెల 0-4-0.**

ఈ చిన్న పుస్తకము కలకత్తాలో మొదట సాధారణ బ్రహ్మసమాజంవారిచే వంగభాషలో వెలువడింది. దానిని శ్రీ నరసింహంగారు తెనిగించి ధర్మసాధని పత్రికలో భాగ భాగములుగా ప్రచురించిరి. అదే యీనాడు యీ చిన్న పుస్తక రూపంలో వెలువడింది. బ్రహ్మధర్మమనునేమో కొంతవరకు తెలిసికొనుట కిది ఉపకరించును.

**బహుభార్యా నిషేధచట్టము (విడాకుల చట్టము) : పి. పి. రెడ్డి. ప్రకాశకులు : ప్రభాత పబ్లికేషన్స్, గూడూరు, నెల్లూరుజిల్లా. వెల 0-1-0.**

సాంఘిక పురోభివృద్ధి నుద్దేశించి నిర్మాణము జరిగిన చట్టములను సులభ గ్రాహ్యంగా చేయడానికి యిట్టి గ్రంథాలు చాల అవసరం. అందులోను సులభమైనశైలిలో హిందూలా విషయాలను ముక్తసరిగా సర్వప్రజానీకమునకు అర్థమయే విధంగా వివరించడానికి ప్రయత్నించి గ్రంథకర్త కృతకృత్యులైనారు.

**శ్రీ రమణాశ్రమ లేఖలు (ద్వితీయభాగము) : శ్రీ సూరినాగమ్మ. ప్రకాశకులు : శ్రీ నిరంజనానందస్వామి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామల. వెల రు 1-12 0**

రచయిత్రి రమణాశ్రమవాసి. పరమ భక్తురాలు. శ్రీ రమణ భగవానుని వాక్కులను సోదరునికి లేఖలు వ్రాయురీతిన గ్రంథరూపముగా రూపొందించి రెండవ భాగంగా భగవత్స్వరూపులగు భక్తులకు సమర్పించినది.

శ్రీ రమణ భగవానుని ఉపదేశాలు యీమె రచనలద్వారా సకల ప్రజల హృదయాలలో ప్రవేశించి ప్రపంచ మానవ కల్యాణానికి దోహదంచెయ్యగలవు.

ఇందులోని వివరణలు అనేక ఆధ్యాత్మిక సంబంధమైన విషయాలను మానవ జీవయాత్రతో సమన్వయ పరుస్తూయున్నవి. విజ్ఞాన వికాసాల వ్యాప్తికి అమూల్య గ్రంథము.

# విండర్ మియర్‌సతి విసనకర్ర

రచయిత : ఆస్కార్ వైల్డ్
అనువాదం : సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

అగస్టన్ ప్రభువు:-అయితే, నేను రాత్రుళ్లు త్వరగా పడుకోవాలని సలహా ఇచ్చేవు!

మిసిస్ ఎర్లిన్:-(కంగారుతో) నేను చెప్పినట్లు చెయ్యండి, నేను చెప్పినట్లు చెయ్యండి.

అ.ప్ర:-మరి నాకు బహుమతో ?

మి.ఎ:-మీ బహుమతా ! మీ బహుమతా ! ఓహో ! దానిని రేపు అడగండి. కాని విండర్ మియర్ ని మాత్రం మీ చూపులోనే ఉండేలాగ చూచుకోండి. ఆయననిగాని విడిచిపెట్టేరంటే నేను మీతో ఇక మాట్లాడను. దానితో మీకూ నాకూ సంబంధం అంతేనన్నమాట. తెలిసిందా-విండర్ మియర్ ని మీక్లబ్బులో మీతో ఉంచుకోవాలి, అతడీరాత్రి ఇక్కడికి తిరిగిరాకూడదు. ('ఎల్' గుండా వెళ్లిపోతుంది.)

అ.ప్ర:-అవును, సరేలే, ఇంచుమించుగా ఆమె భర్తనైపోయేను, తప్పకుండా పోతాను. (దిగ్భ్రమించినవాడిలాగ ఆమెని అనుసరిస్తాడు.)

(తెరవాలుతుంది)

## మూడో అంకం

(డార్లింగ్టన్ ప్రభువు నివసించేగదులు. 'ఆర్' కుంపటికి ఎదురుగా ఒక పెద్దసోఫా. రంగస్థలానికి వెనక భాగాన్ని ఒక కిటికీకి అడ్డంగా తెర లాగబడియుంటుంది. ఎల్. ఆర్. రెండూ తలుపులు. ఆర్ అనే టేబిలుపైన వ్రాతపరికరాలుంటాయి. 'సి' టేబిల్ మీద సైఫనులు గ్లాసులు, టాంటలస్ ఫ్రేము ఉంటాయి. 'ఎల్' టేబిలు మీద చుట్టల పెట్టె, సిగరెట్ల పెట్టె ఉంటాయి. దీపాలు వెలుగుతూ ఉంటాయి.)

విండర్ మియర్ సతి (కుంపటిదగ్గర నిలబడి):-ఆయనెందుకు రాలేదు ? అబ్బ ఎంతసేపని వేచియుండడం. ఈ పాటికి ఆయన వచ్చిఉండాలి. ఆయన త్వరగావచ్చి తన ప్రేమ పలుకులతో మోడువారిన నాలో కాంక్ష ఎందుకు రేకెత్తించకూడదు ? నాలో చేతనంలేదు-నిర్జీవమైన రాతిలాగున్నాను, ఈ పాటికి ఆర్థర్ నా ఉత్తరాన్ని చదివిఉండవచ్చు, ఆయనే నిజంగా నన్ను ప్రేమించిఉంటే, ఈ పాటికి నన్ను వెంబడించి, బలవంతాన్న వెనక్కి లాక్కు

పోవాలి. ఆయన నన్ను ప్రేమిస్తేగా? ఆయన ఆ స్త్రీ వలలో, మోసంలో పడ్డారు; ఆయన్ని తన గుప్పిట్లో ఉంచుకుంది. పురుషుని లోంగదియ్యదలచిన స్త్రీ అతనిలోఉన్న ముఖ్యవ్యసనాన్ని రెచ్చగొడితే-చాలు, అతడు ఆమెకు దాసుడై పోతాడు. మనం పురుషుల్ని దేవతల్లాగ ఆరాధిస్తాం; వాళ్లు మనల్ని విడిచిపెట్టి వెళ్లిపోతారు. కొందరు వాళ్లని ఎంతో నిర్లక్ష్యంగా చూస్తారు, అటువంటి వాళ్లకే ఈ పురుషులు అడుగులకుమడుగు లొత్తుతారు. అబ్బా, జీవితం ఎంత దుర్భర్యం! ... అయ్యో, నేను మతిచెడే ఇక్కడికి వచ్చేను, నిజంగా, పూర్తిగా మతి చెడే. ప్రేమిస్తున్న పురుషుని అధీనంలో ఉండడం మంచిదా, ఇంట్లోనే ఎవతెనో తీసుకువచ్చి అవమానపరుస్తున్న పురుషుడికి భార్యగా ఉండడం మంచిదా? ఎవతె చెప్పగలదు? నా జీవితాన్ని దారపోయనున్న ఈ పురుషుడు నన్ను సొంతంగా క్షేమిస్తాడా? అయినా ఆయనకి నేనేమి అర్పిస్తున్నాను? చిరునవ్వు అణగారి పోయిన పెదవులు, అశ్రుపూరితమైనకళ్లు, చల్లబడ్డచేతులు, చల్లబడ్డ హృదయం. నేను ఆయనకేమీ ఇవ్వబోవటంలేదు. నేను వెళ్లిపోతా - వెళ్ళను; వెళ్లడానికి శక్యంకాదు. నా ఉత్తరం నన్ను వాళ్ల ఆగ్రహానికి ఇంధనంచేసింది. ఆరర్ నన్ను పరిగ్రహించరు! ఆ పాడు ఉత్తరం! మరేం ఫర్వాలేదు. డార్లింగ్టన్ప్రభువు రేపు ఇంగ్లండుకి వెళ్లిపోతున్నారు. నేను ఆయనతో వెళ్లిపోతాను - నాకు గత్యంతరంలేదు (కాస్తసేపు కూర్చుంటుంది. గబగబాలేచి పోదుగుకోటు తొడుగుకుంటుంది) అబ్బే, లాభంలేదు, నేను తిరిగి వెళ్లిపోతా, ఆర్థర్ నన్ను ఏమిచేసినాసరే. నేను ఇక్కడ ఉండలేను. ఏదో పిచ్చెత్తి ఇక్కడికి వచ్చేను. ఇక నేను ఒక నిమిషం కూడా ఆగకూడదు. డార్లింగ్టన్ప్రభువు సంగతో - అయ్యో! ఆయన వచ్చేసినట్లున్నారు! నేనేమిచేయను? ఆయనతో ఏమని చెప్పేది? ఆయన నన్ను వెళ్లిపోనిస్తాడా? పురుషులు పశుతుల్యులు, మోటువాళ్లని విన్నాను ... అయ్యో (రెండు చేతులతోటి ముఖం కప్పుకుంటుంది)

[మిసెస్ ఎర్లిన్ ప్రవేశిస్తుంది]

మి.ఎ:-విండర్మియర్సతీ! (విండర్మియర్సతి భయకంపితయై పైకి చూస్తుంది. ఒక విధమైన జుగుప్సతో వెనకంజవేస్తుంది) భగవంతునిదయవల్ల సరిగ్గా మంచిసమయానికి వచ్చేను. మీరు తక్షణం మీ భర్తగారి ఇంటికి వెళ్లితీరాలి.

విండర్మియర్ సతి:-వెళ్లి తీరాలీ!

మి.ఎ:—అవును, తప్పకుండా ! ఒక సెకండు కూడా వృథాపరచకూడదు. డార్లింగ్టన్ ప్రభువు ఎప్పుడైనా రావచ్చు.

విం.స:—నీవు నాదగ్గిరకి రావద్దు.

మి.ఎ: అయ్యో. శాస్త్రకాలు జారితే మీరు అతఃపాతాళంలోపడిపోతారు. మీరీ చోటుని తక్షణం విడిచిపెట్టాలి— వీధి చివరని నాబండిఉంది—నాతోరండి, ఇద్దరూకలిసి బండ్లో మీ యింటికి వెడదాం.

[విండర్ మియర్ సతి పొడుగుకోటుని గబగబావిప్పి సోఫామీద విసరగొడుతుంది]

ఇదేమిటి, ఇలాగ చేస్తున్నారేం ?

విం.స:—మిసిస్ ఎర్లిన్—నువ్విక్కడికి వచ్చి యుండకపోతే, నేనీపాటికి తిరిగివెళ్లిపోయేదాన్ని. కాని నిన్నిప్పుడు చూడగానే ఎవరు ఎంత బలవంతంచేసినా సరే విండర్ మియర్ ప్రభువూ నేనూ ఒకే యింట్లో ఉండకూడదు అనే నిర్ధారణకి వచ్చేను. నిన్ను చూడగానే నాకు భయంగాఉంది. నీ ముఖం చూడగానే నా అరికాలిమంట నెత్తికి ఎక్కుతున్నది. నువ్విక్కడి కెందుకు వచ్చేవో నాకు తెలుసు. ఆయనగారు నన్ను బ్రతిమాలి నిన్ను తీసుకురమ్మన్నారు; ఆ విధంగా నేను లొంగిపోతే మీ ఇద్దరి నాటకమూ ఇష్టంవచ్చినట్లుగా సాగించవచ్చని.

మి.ఎ:—అయ్యో ! అలాగనుకోకండి—అలాగనుకోకూడదు.

(సశేషము)

---

267 పేజీ తరువాయి

ఆస్థిపాస్తులలో సమానభాగాలను పురుషులతో పాటు స్త్రీలు పంచుకొనినా, తన కుటుంబ సమిష్టిశ్రేయోభివృద్ధులకు అది వినియోగపడిననాడు కుటుంబజీవితము బాగుబడుతుంది. అలా కాకుండా తనవాటా ఆస్థిబాధ్యతారహితంగా వ్యవహరించడానికి, కుటుంబంలో అనైక్యత, అశాంతుల వ్యాప్తికి దోహదంచేస్తే సంఘజీవనం దుర్భరమగుతుంది.

ప్రత్యేక వివాహాల బిల్లు ఫలితంగా ఏర్పడే సమస్యలలో విడాకుల ఫలితంగా ప్రత్యేక పరిస్థితులలో బాలల పెంపకం ఒకటి. వారి పోషణపట్ల, పెంపకంపట్ల ప్రభుత్వము, సంఘముకూడ శ్రద్ధవహించనిచో క్రమంగా రానున్నతరాల మానవకోటి యొక్క నైతిక స్థాయి మరింత పతనం చెందడం తథ్యము.

పున్నయ్య

---

# సంపాదకీయములు

## అభినందనాశీస్సులు

గృహలక్ష్మి భవనంలో పుట్టినరోజు పండుగలు సహజమయినవయినా యీ సంవత్సరము సోదరి కుమారి వసంత జన్మదినోత్సవము ఏప్రిల్ 24 వ తేదీన ప్రత్యేకతగా పేర్కొన తగింది. పూజ్యబాబు చేతుల్లో అత్యంత ప్రేమానురాగాలతో పెరిగింది వసంతకుమారి. తండ్రిలోటు ఏర్పడటం, 18 సంవత్సరముల వయసునిండి వ్యక్తతకుగావడం యీ జన్మదినోత్సవ ప్రత్యేకతలు. బంధుమిత్ర పరివార సమక్షమున నిరాడంబరముగా జరిగిన యీ యుత్సవ సందర్భమున అభినందన, ఆశీస్సులతో ఆమెకు ఒక చేతిగడియారము ఫలపుష్పాదులతో బహూకరించబడింది.

పూజ్యబాబు లేనికొరతను తీరుస్తూ పూజ్యురాలు మాధవమ్మగారు ఉత్సవములో పాల్గొనిన పరివారమునకు తాంబూల కానుకలిచ్చిన సందర్భమున 'గృహలక్ష్మి' కుమారి వసంతను ఆయురారోగ్య ఐశ్వర్యాలతో ఆశీర్వదిస్తూ, పరోపకార చింతతో ఆదర్శప్రాయమైన జీవితమును గడుపుటకు వలయు దయ, సానుభూతులను, ఓర్పును ఆమెకు ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థించుచున్నది.

## ప్రత్యేక వివాహాలబిల్లు

ఈ బిల్లు స్టేట్స్ కౌన్సిల్ ఆమోదం పొందింది. సెలెక్ట్ కమిటీ అందజేసిన నివేదిక ప్రకారం 18 సంవత్సరాలకంటె ఎక్కువ, 21 సంవత్సరాల వయసుకు లోపుగల యువతీ యువకులు తల్లిదండ్రుల అనుమతితో వివాహము చేసికొనవచ్చును.

ఈ బిల్లు యావద్భారత ప్రజానీకానికని కుల, మత, వర్ణ విచక్షణలేకుండా ఉద్దేశించినది. ప్రజలలో సమైక్యతా సాధనకు, ఆయురారోగ్యాల రక్షణ, పోషణలకు, కుటుంబ జీవితములో ఆర్థికస్థిమిత మేర్పడుటకు యీ బిల్లు అమలు ఎంతైనా తోడ్పడగలదు. విజ్ఞానార్జనతోబాటు విచక్షణా జ్ఞానముతో జీవనోపాధిని కల్పించుకొన కలుగునట్టి విద్యనార్జించుటకు, నిలకడైన జీవయాత్రకు మార్గముల నన్వేషించుటకు 18 సంవత్సరములనుండి 21 సంవత్సరములవయసువరకు యువతీ యువకులకు శక్తి సామర్థ్యాలు సమకూరుతవి. ఆ వయసులో జరుగు వివాహాలు సయితము తల్లిదండ్రుల అనుమతితో జరుగనున్నవి కాబట్టి ఉభయుల శ్రేయోపురోభివృద్ధులపట్ల తల్లిదండ్రులు, వారి బిడ్డలు శ్రద్ధవహించగలరనునది సహజంగా ఎంచవచ్చును.

ఈ బిల్లులోని ప్రధానాంశములలో గమనించతగినది మరొక మతస్థునిగాని, మతస్థురాలినిగాని వివాహము చేసికొనిన పిమ్మటకూడ తన మతం అవలంబించడానికి ఏ వ్యక్తికైనా స్వేచ్ఛయున్నది. ఈ విషయం కొంత చీకాకు కలిగిస్తున్నా ఆందోళనకు మాత్రం అవకాశంలేదు. తల్లిదండ్రుల సమ్మతితో యీ వివాహాలు జరుగనున్నవి కాబట్టి వివాహానికి పూర్వం అన్యమతస్థులైనా కానున్న భార్యాభర్తలు ఏదో ఒక అంగీకారానికివచ్చి ఒకరినొకరు అనుసరించడానికి సమ్మతించియే వివాహ నిర్ణయం జరుగుతుంది. కాబట్టి వివాహానంతరం భార్యాభర్తలు ఏమతాన్ని అవలంబించాలనికాని, వారికి జన్మించే సంతానం ఏమతానికి చెందిన వారనేదిగాని సమస్యగా పరిణమించదనే అనుకొనవచ్చును.

ఈ సందర్భమున కేంద్ర న్యాయమంత్రి శ్రీ బిశ్వాస్‌గారు యిట్లు చెప్పారు. "భార్యాభర్తల అన్యోన్యానురాగ పూరితమైన వైవాహిక జీవితం తమ పిల్లలచే విశాల దృక్పథంతోకూడిన మతాన్ని అవలంబింపజేయడం, భగవంతునిపట్ల భక్తి ప్రేమలతో ప్రవర్తించేటట్లు శిక్షణ యివ్వడం మంచిది. 18 సంవత్సరాల వయసు వచ్చేసరికి ఏమతం అవలంబించుకోవాలో ఏ వ్యక్తి కా వ్యక్తి నిర్ణయించుకోనీయండి."

వివాహానంతరము ప్రతి వ్యక్తి అవిభక్త కుటుంబమునుండి తమవాటా ఆస్తిపాస్తులను విడదీసుకొని పోవాలనే నిబంధన యున్నప్పటికీ అట్టి ఏర్పాటులు జరిగిన యనంతరముకూడ తాను అవిభక్త కుటుంబములోనే కలసిమెలసి యుండటానికి అభ్యంతరమేమి లేదు.

## సంపాదకీయములు



ఇటువంటి సంఘ సంస్కరణకని ఉద్దేశించిన శాసనములను సంఘములోని పరిస్థితులతో సమన్వయ పరచుకొని సాంఘిక పురోభివృద్ధికి వినియోగించుకొనుటకు ప్రజలు అలవాటుపడవలసియుంటుంది.

### సానుభూతి

పూజ్యబాబు కేసరిగారి ప్రేమానురాగాలకు, ప్రోత్సాహానికి పాత్రులై పురోభివృద్ధి నొందినవారిలో శ్రీ॥ శ్రీ॥ కే. జి. మీనన్‌గారు అగ్రగణ్యులు. శ్రీ మీనన్‌గారి అకాల మరణం వారి వృద్ధురాలగు తల్లికి, భార్యా బిడ్డలకు, బంధువర్గానికి మితిలేని సంతాపమునకు కారణమయింది.

చనిపోయేనాటికి వీరి వయస్సు షుమారు 45 సంవత్సరములు మాత్రమే. ఐ. సి. యస్. పరీక్షయందు త్తీర్ణులై ప్రభుత్వ శాఖలలో అనేక పదవులను నిర్వహించి, చివర జైళ్ల యిన్స్పెక్టర్ జనరల్‌గా కాల ధర్మము నొందారు. వారు పరోపకారేచ్ఛగల సత్ హృదయులుగా విశేషంగా మన్ననల నందుకొనినవారు.

మేము యీ సందర్భమున శ్రీ మీనన్‌గారి తల్లికి, భార్యా బిడ్డలకు, అశేష బంధువర్గమునకు సంతాప సానుభూతులను తెలియజేస్తూ వారి ఆత్మకు పరిపూర్ణ శాంతిని ప్రసాదించగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నాము.



### విజ్ఞప్తి

శ్రీ కే. యన్. కేసరిగారి మృతవార్షిక దినం 29-5-1954 అయింది. ఈ సందర్భమున జూన్ 15-వ తేదీన వెలువడు 'గృహలక్ష్మి'ని ప్రత్యేక సంచికగా ప్రచురించదలచాము.

శ్రీ కేసరిగారి మిత్రులు, ఆప్తులు, వారి జీవితముతో అత్యంత సన్నిహిత సంబంధము కలిగియుండినవారు రచించి పంపే అమూల్యమైన వ్యాసాలను ప్రచురించుతాము. రచనలు అచ్చులో రెండు పుటలు మించరాదు.

సంపాదకుడు

## శ్రీ జయనామ సం॥ర వైశాఖ-జ్యేష్ఠమాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ మే నెల | 16 | ఆ | చతు 46-6 స్వా 45-42 త్యాజ్యాభావః నృసింహజయంతి |
| | 17 | సో | ○ పౌ 50-25 విశా 51-32 ది 0-56 వ్యాసపూజా |
| | 18 | మం | బహుళపాడ్యమి 54-15 అనూ 56-53 ది 2-17 |
| | 19 | బు | విదియ 53-20 జ్యే 60-10 దివి 11-50 త్యా 4-19 |
| | 20 | గు | తదియ 59-27 జ్యే 1-20 ది 22-3 |
| | 21 | శు | చ 60-10 మూ 4-56 దివి 0-41 |
| | 22 | శ | చ 0-10 ఏష్యం 59-48 పూషా 7-26 ది 27-55 |
| | 23 | ఆ | ష 58-36 ఉషా 8-44 ది 18-46 |
| | 24 | సో | స 55-4 శ్ర 8-49 దివి 18-40 |
| | 25 | మం | అ 51-52 ధని 7-44 ది 25-7 |
| | 26 | బు | న 46 55 శత 5-31 ది 20-43 |
| | 27 | గు | ద 41-11 పూ.భా 2 33 ఉభా 56-14 దివి 24-52 హనుమజ్జయంతి |
| | 28 | శు | ఏ 34-56 రే 54-10 దివి 26-18 కర్తరిత్యాగం |
| | 29 | శ | ద్వా 28-23 అశ్వ 49-32 రా 8-16 త్యా 3-4 |
| | 30 | ఆ | త్ర 21-47 భ 44 58 ది 11 36 తిథిద్వయం |
| | 31 | సో | చతు 15-29 కృ 40-48 దివి 1?-48 |
| | 1 | మం | ● అమా 9-36 రో 37-12 దివి 18-20 |
| | | | **జ్యేష్ఠమాసము** |
| 1954 సం॥ జూన్ నెల | 2 | బు | శుద్ధపాడ్యమి 4-25 ఏష్యం 55-26 మృగ 34-28 |
| | 3 | గు | తదియ 56-29 ఆర్ద్రా 32-32 త్యాజ్యాభావః |
| | 4 | శు | చ 54-46 పున 32-9 ది 2-15 |
| | 5 | శ | పం 54-4 పుష్య 32-47 త్యాజ్యాభావః |
| | 6 | ఆ | ష 54-36 ఆశ్లే 34-38 ది 5-41 త్యా 4-8 |
| | 7 | సో | స 56-16 మ 37-37 ది 6-2 |
| | 8 | మం | అ 58-44 పూఫ 41-39 రా 3-10 |
| | 9 | బు | న 60-10 ఉఫ 46-33 ది 1-10 |
| | 10 | గు | న 2-51 హ 52-6 దివి 0-23 |
| | 11 | శు | ద 6-45 చి 58-2 ది 13-58 |
| | 12 | శ | ఏ 12-0 స్వా 60-10 ది 13-21 త్యా 4-25 |
| | 13 | ఆ | ద్వా 15-39 స్వా 4-6 దివి 19-30 |
| | 14 | సో | త్ర 19-52 విశా 9-57 ది 20-53 చతుర్దశితిథిః |
| | 15 | మం | చతు 23-40 అనూ 15-23 ది 30 31 శూన్యతిథిః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

